## అనువాదకులు



శ్రీ పండిత యన్. విశ్వామిత్ర ఆర్య. M. A. B. ED

ఆంధ్ర భాషోపన్యాసకులు

ఓం

# వేదరహస్యము






రచయిత

మహాత్మా నారాయణ స్వామి

అనువాదకులు

శ్రీ పండిత యన్. విశ్వామిత్ర ఆర్య. M. A. B. ED.

స్వా॥ ప్రకాశకులు_సంపాదకులు

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు

"వైదిక ధర్మ గ్రంథ మండలి"

ప్రధాన కార్యాలయము:- మహబూబాబాద్ జి. వరంగల్
(ఆంధ్రప్రదేశ్)

ధికృత్ సం॥ర జ్యేష్ఠ  వెల: 1-50

ముద్రణ

శ్రీ విరజానంద వైదిక ముద్రణాలయము.

# విషయ సూచిక

# ప్రస్తావన

మానవ ధర్మములకు నిధివంటివి వేదములు. వేదము ఈశ్వరీయ జ్ఞానము. భారతీయులు వేదములను మిక్కిలి పవిత్ర గ్రంథములుగా భావించి వానియెడ అపారమైన శ్రద్ధా భక్తులను చూపుదురు. నేటి పాశ్చాత్య విద్వాంసులును వేదములయెడ శ్రద్ధాళువులై వానిలోని ధర్మరహస్యముల నెరుగుటకెంతయో ప్రయత్నించుచున్నారు.

వేదములను గురించిన ప్రచారము పౌరాణిక కాలములో తగ్గినది, వేదములననెటులుండునో బ్రాహ్మణులకేతెలియని దుస్థితి గలిగెను. పౌరాణికులు, బ్రాహ్మణులే వేదపఠనమునకర్హులని, శూద్రాదులకు వేదపఠనాధికారములేదని ప్రచారముజేసికఠిననిబంధనల నేర్పఱచిరి. ఆంగ్లేయుల పరిపాలనలో భారతీయులు వేదముల పేరునే మఱచిపోయిరి. ఇట్టి సంకట పరిస్థితులలో మహర్షి దయానంద సరస్వతి, వేదములకుత్తమ భాష్యము వ్రాసి తిరిగి వేద ధర్మమును ప్రచారముగావించిరి. మానవమాత్రులెల్లరు వేదపఠనమునకర్హులనిచాటిరి. వేదములుచదువుట, చదివించుట, వినుట, వినిపించుట ప్రతిమానవుని ధర్మమనినుడివిరి. ఆ మహర్షి పుణ్యమాయని నేడు సమస్త భారతదేశమునందేగాక ప్రపంచములోని ఇతరఖండములలో కూడా వేద ప్రచారము సాగుచున్నది

వేదములననేమి? వాని స్వరూపమేమి? వానిలోగల విషయమేమి? వేదముల గురించి పాశ్చాత్యుల యభిప్రాయములెట్టివి? వేదములెవరిచే రచింపబడినవి? అను ప్రశ్నలకు తగు సమాధానము నెఱుగుటకై ప్రతివారుకుతూహల పడుదురు. పూజ్యులగు మహాత్మ నారాయణస్వామిగారు ఈ ప్రశ్నలకు తగు సమాధానములు లభిం

చూనట్లుగా హిందీభాషలో "వేదరహస్యము" ను వ్రాసిప్రకటించిరి. అందు వేదవిషయములను తెలుపుటయేగాక వేదములలోని కొన్ని ముఖ్య మంత్రములకు అర్థ తాత్పర్యములుగూడా వివరించిరి. అది వేద జిజ్ఞాసువుల కెంతయో యుత్తమగ్రంథము. దానిని తెనిగించి ఆంధ్రలోకమునకు వేదముల నిజ స్వరూపమును తెలియ జేయు సంకల్పముతో మిత్రుడు శ్రీ ఏస్. విశ్వామిత్రగారు మంత్ర భాగమును వదలి మిగతా గ్రంథమును తెనిగించిరి. దానిని ఆంధ్రలోకమున కందజేసి వైదిక ధర్మప్రచారమునకు తోడ్పడ వలెననియే మాసంకల్పము. దానినిపుడు ప్రచురించిపాఠకుల కందించుచున్నాము అచ్చటచ్చట ముద్రణదోషములు జరిగినందుకు విచారించుచున్నాము

ఈ అమూల్య గ్రంథమును తెనిగించి ప్రచురించుటకవకాశమొసంగిన మిత్రులు ఎస్. విశ్వామిత్రగారికిని, మరియు సకాలములో పుస్తకమును చక్కగా ముద్రించి యిచ్చిన శ్రీ విరజానంద ముద్రణాలయము యొక్క యజమానులకు మహార్ద్రిక కృతజ్ఞతాభివందనములు.

పాఠకులీ గ్రంథమును పఠించి లాభమును పొందిన మా కృషి సఫలమైనదిగా భావింతుము. వైదికధర్మముయెడ అభిమానము గలవారు మా కార్యమునకు తోడ్పడి ధర్మ ప్రచారమునకు దోహద మొనరింతురని యూహించుచున్నాము.

ఇట్లు

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావు.

ఓం

# వేద రహస్యము



## ప్రథమాధ్యాయము

మానవునకు స్వాభావికజ్ఞానము జంతువులకన్న తక్కువగా నుండును. ఆవులు మొదలగు పశువులదూడలు స్వాభావికముగా నీద గలవు మానవుడు నేర్చుకొనక నీదజాలడు. కాని మానవునిలో జంతువులకన్న విశేషతకలదు. నైమిత్తికజ్ఞానమార్జించి యభివృద్ధి గాంచు యోగ్యతయే నీతని విశేషతకుకారణము. నైమిత్తిక జ్ఞానమున మానవత్వమున్నతస్థాయిని గాంచగలడు. జంతువులకిట్టి యోగ్యత లేనందున నున్నతినిగాంచలేవు. స్వాభావికజ్ఞానము జన్మసిద్ధమైనది. నైమిత్తికజ్ఞాన మితరులచే లభించును: దానిని నేడు మనము పితరులచే, గురువులచే బడయుచున్నాము. సృష్ట్యారంభమున నమైథున సృష్టియందుజనించిన, ప్రథమమానవజాతికి శిక్షణ నొసంగి, నైమిత్తికజ్ఞానము గలిగించువారెవరుండిరి. దీనిని గ్రహించుట కమైథున సృష్టినిగురించి యెఱుంగుటవసరము.

### అమైథున సృష్టి :-

మహాప్రళయమున జగత్తుండదు. కార్యరూపమున పరిణమించిన ప్రకృతి చిహ్నములుకూడా నుండవు. ఏ లోకముకూడా

మిగిలియుండదు. సూర్య చంద్రాది లోక లోకాంతరము లన్నియు కారణప్రకృతిలో కలిసిపోవును. "తమాసీత్తమ సా గూఢమగ్రే" (ఋ 10-129-3) యను ఋగ్వేదమంత్రమున, సత్వ రజ స్తమముల సామ్యావస్థయను జగత్తు కారణప్రకృతిలో లీనమైయుండు విషయము చెప్పబడియున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్రముకూడా "మహా ప్రళయ వాదము"ను సమర్థించినది. క్లాషియస్ యనువిజ్ఞాని—
( The founder of the M'cha'ical Theory of Heat )
ఉష్ణమును రెండువిభాగములుగా దెలిపినాడు

1- బ్రహ్మాండమునగల ఉష్ణము స్థిరముగానుపయోగపడుచుండును
2- నిరుపయోగమగుయుష్ణ మత్యధికమగుచుండును. ఇది అంతర్భాగములో జరుగుచుండును.

ఈ రెండవయుష్ణశక్తి తాపరూపములోనుండియు శీతలపదార్థములలో విభక్తమై, నిరుపయోగముగానుండును. మొదటియుష్ణశక్తి నిత్యముపయోగపడుటచే తగ్గిపోవును. మొదటిది తగ్గుటచే రెండవశక్తి పెరుగుచుండును ఇటుల బ్రహ్మాండములోని కర్తృత్వశక్తి, రెండవయుష్ణశక్తిగా పరివర్తనజెందు నిరుపయోగమగును. ఇది క్రమముగా తగ్గుచు, జగత్తులోని శీతోష్ణభేదము తొలగించి, పదార్థములన్నింటి నావరించును అపుడవిగతి శూన్యములై పనికి రానివగును. ఇటుల జరిగినపుడు ప్రాణుల జీవనగతుల అంతమగును.

ఇటుల రెండవ యుష్ణశక్తి మొదటిదాని నంతమొనర్చి, తానే సర్వత్ర వ్యాపించినపుడు మహాప్రళయము జరుగును. ఈ స్థితి కొంతకాలముండి మరల నూతనసృష్టి యేర్పడును. ఇపుడు "యోని" యుత్పత్తిని గురించి తెలుపుట యవసరము. వైశేషిక దర్శనములో, "తత్ర శరీరం ద్వివిధం యోనిజం, అయోనిజంచ."

(4-2-6) శరీరములు యోనిజములనియు, అయోనిజములనియు. రెండువిధములుగా నుండునని తెలుపబడియున్నది.

1- యోనిజము :- మాతాపితరుల సంయోగమునఁనేర్పడునది దీనిని మైథునసృష్టి యందురు.

2- అయోనిజము :- మాతాపితరుల సంగమము లేక కలుగునది. ఇది యమైథున సృష్టియనబడును.

సమస్త ప్రాణులు నాలుగు విధములుగా పుట్టుచున్నవి—

1- జరాయుజములు : జరాయువు (మావి) లో బెరిగి, దానిని జీల్చుకొని జనించునవి. మనుష్యులు, పశువులు మొదలగునవి యిట్టివి.

2- అండజములు : గ్రుడ్లనుండి పుట్టునవి. పక్షులు, చేపలు, సర్పాదులు.

3- స్వేదజములు : చెమటచే జనించునవి. పేలు మొదలగునవి

4- ఉద్భిదములు : భూమిని బెకల్చుకొని పుట్టునవి. వృక్షములు.

ఈ నాలుగు విధములలో చివరి రెండువిధముల ప్రాణులు సదా అమైథున సృష్టివలన జనించును. పై రెండురకముల ప్రాణులలో మైథున, అమైథునములగు ద్వివిధసృష్టి గలదు.

అమైథున సృష్టి క్రమము : పంచభూతము లేర్పడిన పిమ్మట భూమినుండి యోషధులు, ఓషధులనుండి యన్నము, అన్నము నుండి వీర్యము మరియు వీర్యమువలన పురుషుదుత్పన్నమయ్యెను. ఇటుల జరుగునని తైత్తిరీయోపనిషత్తులోని బ్రహ్మానందవల్లిలో

గల "తస్మాద్వాయే తస్మా దాత్మనా" యను మంత్రములలో గ లదు. మైథున సృష్టియందును అమైథున సృష్టియందును, రజో వీర్యముల కలయికచేతనే ప్రాణులు జనించును.

మైథునసృష్టిలో, రజో వీర్యములుకలిసి మాతృగర్భములో గర్భధారణజరుగును. కాని యమైథునసృష్టిలో జనని యనునదుండనందున గర్భధారణ బయటనే జరుగును. అధునిక జీవశాస్త్రజ్ఞులుకూడా దీనిని సమర్థించి, మాతృ గర్భములేకుండా వెలుపలనే రజోవీర్యములుకలిసి జనించుప్రాణులున్నవని తెలిపియున్నారు. అట్టి ప్రాణులలో కొన్నింటినిగురించి క్రిందతెలుపబడును.

1- సముద్రములో నొకతెగకుచెందిన చేపలున్నవి. ఈ ఆడుచేపలలో ఋతుసమయమున ననంఖ్యాకములగు రజోకణములు పుట్టును. అటులనే మగచేపలయండకోశము లందును వీర్యకణములు జనించును. వీని యండకోశములు కడుపు క్రింది భాగమునసుండును. ఆడచేప నొకచోట సామాన్యముగా నిసుక, ఘాతి ప్రదేశములందు-వేలకొలదిగా రజోకణముల విడుచును. అదేసమయమున మగచేపయు నా రజోగుణములపై వీర్యకణముల వదలును అటుల నవి వెలుపలనేకలిసి అండములగును.

2- మరొకరకపు కప్పలున్నవి అవి రజోవీర్యకణముల బయటనే విడుచును. మగకప్ప ఆడకప్పవీపుపై కూర్చొని, ఆడకప్ప విడుచు రజోకణములపై తనవీర్యకణములువిడుచుటచే, వెలుపలనే యండమువేర్పడుచున్నవి.

3- మనుష్యుల ప్రేగులలో జనించు బద్దెపురుగులు (TapeWorm) ఒకేసారి యిరువదివేల గ్రుడ్లనుపెట్టును. గ్రుడ్లనుండి కీటక

ములు వెడలగానే వానితలలకు కొక్కెములవంటి వేర్పడి యుం డును ఆ కొక్కెములతోనవి ప్రేగులలోనుండు "ఆమ" పదా ర్థములో దగుల్కొని యుండును. వానితలల నుండియే శరీర ములు వికసితములగును ఈ శరీరము లనేకభాగములుగానే నేర్పడియుండును ప్రతిభాగమున స్త్రీ పురుషాంగములుండును వానితో బాహ్యసహాయము లేకనే గర్భమేర్పడును. కొంత కాలమునకు ప్రాతభాగములువేరై స్వతంత్ర కీటకములుగా నగును.

పై యుదాహరణల వలన, మాతృ గర్భమునకు వెలుపల రజోవీర్య సమ్మేళనమున, ప్రాణిజనించునను విషయము సుబోధ కమగును.

అమైథునసృష్టిలోను మానవ శరీరమును నిర్మించు రజో వీర్యములు బయటనేకలిసికొని. చెట్లయొక్క వెడల్పగు పత్రముల రూపముననుండు పొరలలో గర్భముగా నేర్పడి, సురక్షితముగా వృద్ధిజెందును. పుష్ప పరాగసంపర్కమును గాంచినచో నీ పొరల లో రజోవీర్యకణములెట్లు కలియునను విషయమర్థమగును.

పూలమొక్కలనుండి వీర్యకణములను కీటకాదులు, పక్షులు తెచ్చి, ఆడమొక్కల రజోకణములపై విడుచును. దానితో పుష్ప ఫలాదులేర్పడును. అందుచే పక్షిని "పుష్పవివాహపురోహితు"డని (Marriage priest of flowers) చెప్పుదురు. ఇటుల ప్రాణిబాహ్య గర్భమునపెరిగి తనను తాను రక్షించుకొనుస్థితిని జెందగనే, పత్ర రూపముననుండు "పొర" పగిలిపోవును. అందుండి ప్రాణి బయ టకువచ్చును. దీనినే యమైథునసృష్టియందురు.

ఒక కీటకముయొక్క యుదాహరణ :

ప్రాణుల యిచ్ఛమునేకనే రజోవీర్యములు స్వయముగా కలియును మరియు ప్రాణిపెరిగి పనిచేయుటకు యోగ్యమైనది కాగానే "పొర" స్వయముగా పగిలిపోవుట మొదలగుకార్యము లలౌకికములుగా జరుగుచున్నవి దీనికొక యుదాహరణగాంచుడు:-

"నేను బృందావన గురుకులములో నున్నప్పుడు గురుకులోద్యానములో నిర్మించిన యొకభవన మందుంటిని. దానికి నలువైపుల "సుదర్శన" జాతి మొక్కలుండెను. ఆ యందమైన మొక్కలపై నొకవిధమగు కీటకముపుట్టి, వాని ఆకులను, పువ్వులను చెడగొట్టెడిది. అదెక్కడనుండి వచ్చుచున్నదో గ్రహించుటకు యత్నించి ఈ క్రింది విషయమెఱింగితిని:-

ఆమొక్కయొక్క చిగురులు వెళ్లగానే జాగ్రత్తగా కాపాడుచుంటిని. ఒకఆకుపై నొకనల్లరంగుగల - పొగాకువలెనుండు-యేదోవస్తువువచ్చి యతుకుకొనెను. అదెటనుండి వచ్చినదో తెలియదు. రెండు మూడుదినముల పిమ్మట నదొకయజ్ఞాత శక్తిచే, దళసరిగానుండు ఆకుపొరమధ్యలో జేరెను. పరిశీలింపనల్ల, నల్లని పదార్థమే ఈ దళసరిపొరలోజేరినదని తెలినవి. నాలుగురోజులలో నా వస్తువున కొకపక్రిక్కనున్న, పలుచనిపొర మిక్కిలిగట్టిపడెను. అదొకగట్టి ముడివలెనేర్పడెను. పిమ్మట దానిరూపముగాని, రంగుగాని, కనబడకుండెను. క్రమముగా నది యాకులో బొడవుగా బెరుగుచున్నట్లుతోచెను, పది దినములలో రెండంగుళముల పొడవయ్యెను. మరొకసప్తాహములోనే యాకుపగిలియందుండి ఒకపచ్చ రంగుగలకీటకము బయటకువచ్చెను. దానిశరీరముపై బంగారువర్ణ

ముగలరేఖలుండి, మూడు విభాగములుగానుండెను. అదొకచిటికిన వ్రేలు ప్రమాణముగలిగి యుండెను. ఈ కీటకమే సుదర్శన మొక్కల పూవులను, ఆకులనుతిని, చెడగొట్టుచున్నదని తెలిసినది.

ఆకీటకమును నొకగాజుబీరువాలో కొన్నియాకులతోపాటు పెట్టితిమి. పది పన్నెండుదినముల పిమ్మట బీరువా తెరువగా నందుండి మూడు సీతాకోకచిలుకలు వెడలి యెగిరిపోయినవి, పిమ్మట కీటకముయొక్క చిహ్నమేదియును గనిపించలేదు. ఈ పరీక్షవలన నమైథునసృష్టియొక్క కార్యక్రమము సుబోధకమైనది.

## పోత చట్రముల (సాంచా) యుదాహరణ :

ఆటవస్తువులనునిర్మించు కళాకారుడు మొదట పోతచట్రము (సాంచా) సిద్ధముజేయును ఆ చట్రములో బిమ్మట ననేక యాట బొమ్మలను నిర్మించును. ఇదేవిధముగా నమైథునసృష్టియును పోత చట్రముల నేర్పఱచు కార్యక్రమము వంటిదని చెప్పవచ్చును. మైథునసృష్టి. పోతచట్రములతో నాటబొమ్మలను నిర్మించు కార్యము వంటిది.

## సమస్తప్రాణుల యమైథున సృష్టి :

కేవలము మనుష్యులే యమైథునసృష్టిలో జనింతురని తలంచవలదు. ప్రారంభమున పశు పక్ష్యాదులయుత్పత్తి కూడ నిటులనే జరుగును. గతసృష్టిలోజేసిన కర్మలవిభిన్నతవలన నీ విభిన్న యోనులేర్పడినవని వైశేషిక దర్శనకారుడు తెలిపియున్నాడు. మహా, ప్రళయానంతర మెచ్చట నే ప్రాణియు, నే జాతియు నుండదని, వైశేషికదర్శనములో "అనియతదిగ్దేశ పూర్వకత్వాత్"(4-2-71)

యును సూత్రమున దెలుపబడియున్నది. అందుచే సృష్ట్యారంభ మున నమైథునసృష్టి యవశ్యముగా జరుగును.

మరొకచోట వైశేషికదర్శనములో "సమాఖ్యా భావాచ్చ తథా సంజ్ఞాయా ఆదిత్యాత్"(వై 4-2-9,10)సూత్రములందిట్లు వివ రించినాడు. ప్రాచీనార్య సాంప్రదాయాను సారముగా నమైథున సృష్టిలో జనించినవ్యక్తులను తండ్రిపేరుతో బిలువరు. భరద్వా జుని పుత్రుడు భారద్వాజు డనబడినట్లు ప్రాచీనవ్యక్తుల పేర్లిటుల తద్ధితవాచకములుగా లేక మూలనామములుగానేయుండెను. అగ్ని వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు, బ్రహ్మ మొదలగు నామము లిట్టివే మాతాపితరులు లేనందుననే వారిటుల పిలువబడుదురు.

"సంత్య యోనిజా" (వై. 4-2-11) "వేద లింగాచ్చ" (వై. 4-2-12) అను సూత్రములలోను దర్శనకారు డమైథున సృష్టిని [illegible]రచి వేదముకూడా దాని నామోదించుచున్నదని తెలిపి యున్నాడు. అమైథునసృష్టిలోజనించిన మానవుల సంబోధించుచు ఋగ్వేదములో నిటులకలదు.

" నహివో అస్త్యర్భకో దేవాసో నకుమారకాః
విశ్వేసతో మహాంత ఇత "(ఋ. 8-30-1)

"ఓ సమస్త ప్రాణులారా! మీరు శిశువులుకారు. మరియు కుమారులును గారు. మీరు కేవలము మహానీయులు(యువకులు).

ఇటుల వేదముకూడా అమైథునసృష్టిని ధృవపరచుచున్నది.

నైమిత్తిక జ్ఞానము : అమైథునసృష్టిలో జ్ఞానము నొసంగు మాతాపితరులుండరు అపుడు జ్ఞానమెట్లు కలుగునను ప్రశ్న జనిం

చును. ఈ పరిశ్నకు సమాధానముగాంచక నీశ్వరీయజ్ఞాన ప్రాప్తి నిగుఱించి కల్పనగావించ బడుచున్నది. యోగదర్శనములో "స ఏవ పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్" (2-31) యను ప్రసిద్ధసూత్రమున్నది. కాలాతీతుడగుటచే నీశ్వరుడే యాదిమ ఋషులకును గురువని దీనియభిప్రాయము.

ఋషుల భేదము : ఋషులు రెండు విధములుగా నుందురు. 1- దేవ్యఋషులు. 2- శ్రుతఋషులు. వేదజ్ఞానముగాంచిన అగ్ని వాయు, ఆదిత్య, అంగిరసులను వారు దేవ్యఋషులు. దేవ్యఋషులవలనను లేక తమకన్న పూర్వమున్న ఋషులవలన నుపదేశము బొందినవారు శ్రుతఋషు లనబడుదురు. ఈ ద్వివిధ ఋషులనే పూర్వఋషులనియు, నూతనఋషులనియు జెప్పుదురు.

"అగ్నిః పూర్వేభిః ఋషిభి రీఢ్యో నూతనై రుత,
స దేవాన్ ఏహ వక్షతి" (ఋ. 1-1-2)

"ఆ (అగ్ని) ఈశ్వరుడు, పూర్వ (దేవ్య) మరియు నూతన (శ్రుత) ఋషులచే స్తుతింపదగినవాడు"

దేవ్యఋషుల యుత్పత్తి సృష్ట్యారంభమున నొకేసారి జరుగును. వారు మరల మరల జనించరు. శ్రుతఋషులు మాటి మాటికి జన్మింతురు. అందువలన, తమకు శ్రుతఋషి యోగ్యులగు సంతానము గలుగవలెనని, మానవుడు ప్రార్థించువిధానము ఋగ్వేదములో నిటులకలదు. "సుబ్రహ్మణ్యం దేవవంతం బృహంతమురు గంభీరం పృథు బుధ్నమింద్ర। శ్రుతఋషి ముగ్రమపి మాతిషాహమస్మభ్యం చిత్రం వృషణం రయం దాహ" (ఋ.10-47-3)

"ఓ ఇంద్రుడా! మాకు, వేదములను ప్రేమించు పరమాత్మభక్తుడు, ఉదారుడు, విశాలహృదయుడు, గంభీరుడు, వ్యాపించిన మూలములు (యశస్సు) గలవాడు, తేజస్వి, ఇంద్రునివలె శత్రువుల నణచువాడును, విచిత్రశక్తిశాలియునగు శ్రుతఋషియగు పుత్రునొసంగుము.

యోగసూత్రములలోగల "పూర్వేషాం" అను శబ్దమునకు దేవ్యఋషులని యర్థము. ఈ దేవ్యఋషులకు గురువు పరమేశ్వరుడని సూత్రములలోచెప్పబడినది. జగదారంభమున జ్ఞానము(నైమిత్తికము) పరమేశ్వరునివలన లభించును. ఈ సిద్ధాంతము జగదారంభమునుండి డార్విన్‌కాలమువరకు సర్వ సమ్మతముగా నంగీకరింపబడుచు వచ్చుచున్నది. డార్విన్ యను శాస్త్రజ్ఞుడు వికాసవాదము ద్వారా యీ సిద్ధాంతము సర్వసమ్మతముగాదని యధిక్షేపించినాడు. దానిని గురించి క్రిందతెలుప బడుచున్నది.

వికాసవాదము : డార్విన్ మతానుసారముగా, యోనివికాసము వలన పశువులనుండి మనుష్యు డేర్పడినాడు. యోనివికాస క్రమ మిటులున్నది:—

1) మొదట "అమీబా" మొదలగు యేకకణ ప్రాణులుండెను 2) పిమ్మట ఆదిమత్స్యము లేర్పడినవి. 3) తదుపరి శ్వాసకోశములుగల చేపలు జనించినవి. 4) అటుపై సరీసృపములు, నీటికప్పలు, జలజంతువులు పుట్టినవి. 5) అనంతరము స్తన్య జంతువు లేర్పడినవి. 6) అటుపై అండజ స్తన్యములు, 7) పిండజములు అనగా జరాయుజ స్తన్యప్రాణులు జన్మించినవి. 8) ఆపైన జరాయుజ స్తన్యములు, 9) పిమ్మట కింపురుష -- వానర

రూప మానవజాతి - జనించినది. ఈ వానరరూప మానవజాతికి పలుచని ముక్కులుండెడివి. - మొదటతోకకలిగి, కుక్కుటాకారముగానుండెను. తదుపరి తోకలేని నరాకారముగల వానరశాఖ(లోపించినతెగ)నుండి, మూగమనుష్యులు మఱియు వారినుండి మాట్లాడు మానవులు పుట్టినారు.

ఇట్టి "యోని వికాసము" తోపాటు "మానసిక వికాస" కల్పననుకూడా, డార్విన్ కల్పించి ప్రకటించినాడు. ఇతరుల ప్రమేయము లేకుండనే మానవునితో క్రమముగా జ్ఞాన మభివృద్ధి గాంచినదని యితడు తెలిపినాడు.

వికాసవాదము - విమర్శన : వికాసవాదమును విమర్శించి, శాస్త్రజ్ఞులీసిద్ధాంతముపై యాఱు యాక్షేపణల గావించినారు.

1- మొదటి ఆక్షేపణ : ఒకవికాసవాదజ్ఞుని యభిప్రాయానుసారము, ప్రాణి వికాసము జెందుటలో, ఉద్భిదములనుండి మనుష్యయోనివరకు 67 లక్షల యోనులున్నవి. ఈ 67 లక్షల యోనుల వివరణనొసంగి, వాని వికాసమును ధృవీకరించు విషయమటుంచి, వాని నామములదెలుపుటకూడా నతనికసంభవమయ్యెను. జర్మన్ దేశస్థుడగు, 'అర్నెస్ట్ హైకెల్'యను ప్రసిద్ధ జీవశాస్త్రజ్ఞుడు, తన గ్రంథమున నొకచోట నిటులవ్రాసియున్నాడు.

"చేపనుండి మానవునివఱకు కనీసము 53 లక్షల 75 వేల యోనులేర్పడినవి. బహుశః యీసంఖ్య యింకను పదిరెట్లుగానుండు నేమో"

(Lost Linkby Ernest Haeekal wiht notes by Dr. H. Gada)

పురాణములలో 84 లక్షల యోనులున్నట్లుతెలిపి, వాని వివరము లిటుల చెప్పబడినవి.

| | | |
|---|---|---|
| స్థావర యోనులు | | 30 లక్షలు |
| జలచర యోనులు | | 9 ,, |
| క్రిమి | ,, | 11 ,, |
| పక్షి | ,, | 10 ,, |
| పశు | ,, | 20 ,, |
| మనుష్య | ,, | 4 ,, |
| | మొత్తం | 84 ,, |

స్థావరయోనులవీడిన, జలచరములనుండి మానవుని వరకు 54 లక్షల యోనులుకలవని పురాణములవలన తెలియు చున్నది. పురాణములకుపిమ్మట వందలకొలది సంవత్సరముల అనంతరము జనించిన హైకెల్ పండితుడు 53 3/4లక్షల యోనులవరకు లెక్కించినాడు. ఈసంఖ్య ఇంకను పదిరెట్లుండునేమోయని సందేహమును దెలిపి తన యసమర్థత ప్రకటించినాడు.

కొన్ని ప్రత్యేకజంతువుల వివరణనిచ్చి, వానిలోను కొన్ని లోపించినతెగల వివరములివ్వజాలకున్నను, తమ యోనివికాసక్రమమే ప్రామాణికమనీ తలంచుట సాహసమేయగును.

2- రెండవ ఆక్షేపణ : నేటికిని వందలకొలది జంతువులు గ్రుడ్డిగానే పుట్టుచున్నవి. వీని వికాసమేల జరుగలేదు? జంతువులేకాక నేటికి ననేక ద్వీపములలో నరభక్షకులగు మానవులున్నారు. వీరిజ్ఞానము క్రమముగా వృద్ధిజెందకపోవుటకు కారణమేమి?

3- మూడవ ఆక్షేపణ : యోనిపరివర్తనావాదమును బలపఱచుటకై మాతృగర్భములోజరుగు, వివిధ పరివర్తనాదశల నుదాహరించుదురు.

1) గర్భారంభమాసమునుండి, మానవాకారమేర్పడువఱకు గర్భముయొక్కరూపము, యోనివికాస క్రమమున జనించిన ప్రాణులబోలియుండుననియు, చివరనెలలలో, దానియందు మానవ చిహ్నములేర్పడుననియు చెప్పుదురు కాని యాధునిక పరిశోధనల వలన నిది యసత్యమని తేలినది.

C. J. రియాన్ అనునతడు "థియాసోఫికల్ పాథ్" యను గ్రంథములో 'డా ఉడ్ జోన్సు' యొక్క యభిప్రాయ మిటుల దెలిపినాడు. (The Problems of Man's Ancestry - P - 33) "మానవగర్భము, వానరగర్భమువలె చివరనెలవరకును గుర్తింపబడజాలదను హైకల్‌వాదన నమ్మదగనిది. మానవేతర ప్రాణులలో గనిపించని, యావశ్యక శరీరాంగములు, మానవగర్భములో సాధ్యమైనంతవఱకు మొదటనే ప్రకటమగుచున్నవి. చతుష్పాత్తులగు జంతుయోనులనుండి మానవుడు వికాసము జెందినచో, అతని ప్రత్యేకావయవములు గర్భాంతిమదినములలో ప్రకటితముకావలసియుండును."

వికాసముద్వారా మనుష్యయోని యేర్పడలేదనియు, అది వీనియిన్నిటికన్న భిన్నమైన స్వతంత్రయోనియనియు, 'ఉడ్ జోన్సు' తనరచనలో స్పష్టమొనర్చినాడు. పది నెలలలోనే రజోవీర్యముల కలయికచే మానవుడు జన్మించుచుండగా, నందుకు లక్షలకొలదివత్సరముల కాలముబట్టినదని జెప్పుట నీశ్వరశక్తిని (Nature) అవమాన పఱచుటయే యగును.

2) లండన్‌నగరములోని, బ్రిటిష్ వస్తుప్రదర్శన శాలాధికారియగు, డా. ఇథిరజ్, తన యనుభవముల పురస్కరించుకొని యిటులవ్రాసినాడు. "ఈ మహావస్తు ప్రదర్శనశాలలో యోని పరివర్తన నేమాత్రమైనా బలపఱచు సాధనములు లేవు వికాస వాదము నేర్పఱచుటకై చెప్పెడి మాటలలో 9/10 భాగములు వ్యర్థ ప్రలాపములే. పరీక్షలో నవి సరియైనవిగా గనిపించుటలేదు. అంతియేగాక, సంఘటనలుకూడా యీవాదమును బలపరచుటలేదు."

( Dr. Etheridge of the British Museum, London )

3) యోని పరివర్తన నెవరును జూడలేదని ప్రొఫెసర్ ఓవిన్ వ్రాసియున్నాడు.

4) ప్రొఫెసర్ థాంసన్ యిటులతెలిపియున్నాడు. "మానవుడెటనుండి వచ్చినాడో (లేక యెటుల జనించినాడో) మనకు తెలియదు. మానవోత్పత్తినిగుఱించి వికాసవాదము జెప్పువిషయములు, కల్పనపై నాధారపడియున్నవని యందఱంగీకరింతురు. విజ్ఞానశాస్త్రములో దానికెట్టి స్థిరమైన స్థానములేదు.

5) ప్రొఫెసర్ డౌసన్ యిటుల నుడివినాడు. "మనుష్యునిగా నిర్మించునని చెప్పబడు మధ్యయోనులు, వైజ్ఞానికులకపరిచితములైనవే. అతిప్రాచీనకాలపు మానవావశిష్టచిహ్నములు, ప్రారంభమునుండి మానవునిరూపమిట్టిదేయని తెలుపుచున్నవి. ఆయవశేషములు వికాసవాదమును బలపఱచుటలేదు."

4- నాల్గవ యాక్షేపణ : ప్రత్యక్షమునకు విరుద్ధ మగుటచే వికాసవాదము వైజ్ఞానికమైనదికాదు. ప్రపంచములో జన్మించినది

నశించునను సార్వత్రిక నియమముకలదు వృద్ధిజెందునది చివరకు క్షీణించును. సూర్యుని యుష్ణము పెరిగి యిప్పుడు తగ్గుచున్నది. మనుష్యుడు జన్మించి క్రమముగా యువకుడై, వృద్ధుడై చివరకు మరణించుచున్నాడు. వృక్షాదులస్థితియు నిట్టిదే. నశించక కేవలము వృద్ధిజెందుచునేయుండు నదెక్కడను గోచరించదు. పెరుగుటతో పాటు తగ్గుటయనివార్యము. డార్విన్ వికాసవాదము మాత్రమొం టిగెద్దుకల బండివంటిది. అది ప్రాసహాస్యమగు వికాసము. అందు చేనంగీకరింపరానిది.

5- ఐదవ యాక్షేపణ : క్రమముగా జ్ఞానము వృద్ధి జెందు నను సిద్ధాంతము పూర్తిగా నిరాధారమైనది. అదొక క్లిష్టమగు కల్పనామాత్రమే. అనేకులీవిషయమును పలుమారులు పరీక్షించి నారు. అందఱి పరీక్షాఫలిత మొక్కటియే. జ్ఞానము క్రమవికాసము గాంచునను సిద్ధాంతము విశ్వసనీయముకాదనియే యీ పరీక్షాఫలిత ములు దెలిపినవి. పరీక్షకుల వివరములిట నివ్వబడుచున్నవి:-

1) “అసురవానాపాల్” [లేయార్డు’ మఱియు “కాలిన్సన్” యను యిరువురన్వేషకులు, “నైనవా” మఱియు “బైబిలన్” (అస్సీరియా) ప్రాచీనశిథిలముల త్రవ్వించిరి. ఇటుకలపై వ్రాసిన గ్రంథాలయ మొకదానిని, వారందు కనుగొనిరి. ఈ పుస్తకముల వలన “వానాపాలు”ని పరిశోధనలసంగతి తెలియవచ్చినది. ఈ వానాపాలుడే బాణాసురుడని పురాణములలో వ్రాయబడియున్నది. అతడీదేశముపై ఆక్రమణగావించి శ్రీకృష్ణునిచేనోడింపబడియెను.]

2) గ్రీకురాజగు సెమెటికల్.

3) రెండవ ఫ్రెడరిక్.

4) నాల్గవ జేమ్సు ( James IVth of Scot Land)

5) అక్బరు : [ఇతడు 30 మంది శిశువులపై యీ పరీక్ష గావించినాడు — ఎల్ఫిన్స్టొన్ ముజాహిద్]

పైన చెప్పిన రాజుల యాధిపత్యములో ననేకవిద్వాంసులు పది పదిమంది నవజాత శిశువులను గాజుగృహములోనుంచి, వారిని పెంచుటకై దాదుల నియమించిరి. శిశువులను కేవలము తినిపించి, త్రాగించి పెంచుటయేకాని, వారికెట్టి శిక్షణ నొసగవలదనియు, వారితో మాట్లాడవలదనియును దాదులకాజ్ఞాపించిరి. వారు నటులనే పెంచిరి. అట్లుపెరిగిన పిమ్మట వారిని పరీక్షించగా. వారు మూగవారుగను, బధిరులుగను నుండుట ఋజువైనది.

(Transactions of the Victoria Institute- Vol. 15 P 336)

శిక్షణ నివ్వకుండ స్వయముగా జ్ఞాన ముత్పన్నమగుచో, సీబాలకులకుకూడా మాటలుస్వయముగా రావలసియుండెను. వారు మూగవారుగా, చెవిటివారుగా నుండుటవలన, స్వయముగా జ్ఞానముత్పన్నమై వృద్ధిజెందదను విషయము ఋజువగుచున్నది.

6- ఆఱవ ఆక్షేపణ : నేటివైజ్ఞానికులును క్రమముగా జ్ఞాన వృద్ధిజరుగునను విషయమును తిరస్కరించుచున్నారు:—

1) సర్ ఆలివర్‌లాజ్ జ్ఞానవికాస సిద్ధాంతమును వ్యతిరేకించినాడు. లలితకళలు, ఫోటోగ్రాఫి మొదలగునవి శిక్షణలేక నెవరైనానేర్చుకొనగలరా? 'బాల్ఫోర్'యను విద్వాంసుడు 'లాజ్' యొక్క యభిప్రాయమునే సమర్థించినాడు.

( Life and Matter, by Sir Oliver Lodge — Page 143 )

2) వికాసవాదమును కనుగొన్నవారిలో నొకడగు "డాక్టరు వాలెస్" క్రమముగా జ్ఞానవికాసము గలుగునను సిద్ధాంతమును వ్యతిరేకించినాడు. అతడిటుల వ్రాసియున్నాడు. "వేద ఋక్కులలో గల యభిప్రాయములవ్రాసినవారు. అత్యుత్తములగు మన యాచార్యులకంటెను, మిల్టన్, టెన్నిసన్ మొదలగు వారికంటె నే మాత్రమును తక్కువవారు కారు."

Social environment & Moral progress. by Dr Wallace, P.17

3) ఈజిప్టు మఱియు మెసొపొటేమియాలోని ప్రాచీనకళలను మఱియు రేఖలను బాగుగా పరీక్షించి, యవి నేటి మనయత్యుత్తమకళలకన్న నేమాత్రము తక్కువకావని డాక్టరు వాలెస్ ప్రకటించియున్నాడు ఇట్టివనేక విషయములనాతడు పరిశీలించి, క్రమముగా జ్ఞానవికాసము జరుగునను వాదన, నిరాధారమని తెలియజేసినాడు. ( Social environment and Moral progress, by Dr. Wallace, Page 5-26 )

4) గాలెటన్ మహాశయుడిటుల తెలిపియున్నాడు "గ్రీకుల సరాసరియోగ్యతను తక్కువలో తక్కువగా లెక్కించిన, నది మనసభ్యతకన్న రెండింతలు హెచ్చుగానున్నది. ఆఫ్రికాలోని నీగ్రోలకన్న మనసభ్యత నెంతగొప్పగా తలంతుమో, అంతియే యున్నతస్థాయిలో మనకంటెను గ్రీకు సభ్యతయుండెను."

(Heridity Genius, by Gatton, Page 331)

'ఆన్ ఫీల్డు' యనునతడు గ్రీకులెట్లు యోగ్యతసంపాదించిరో తెలిపియున్నాడు. "పైథాగొరస్, అన్కసాగోరస్, పిరహో మొదలగు గ్రీకువిద్వాంసులనేకులు భారతదేశమునకువచ్చి విద్యా

భ్యాసము గావించిరి. పిమ్మట తమదేశమునకువెళ్ళి ప్రసిద్ధ ప్రైజ్ఞానికులైరి." (History of philosophy, Vol I, Page 65)

ప్రొఫెసర్ గోల్డ్‌స్మిత్ వ్రాసిన 'The loss of life' అను పుస్తకమును విమర్శించుచు, W. E. Key యను విద్వాంసుడు 'Good Health' పుస్తకములో నిట్లువ్రాసినాడు "వికాసవాదము యొక్క అర్థమును గ్రహించుటకు పూర్వమీమాంసమును, నాస్తికత్వమును బోధించుటకును, కోతులనుండియే మానవుడు జనించినాడని తెలుపుటకేయున్నదనియు భావించవలెను"

(Vedic Magazine, September 1923)

"హైరి" మరియు ఏడ్వర్డు కార్పెంటర్" అను వారలును తమ తమ గ్రంథములలో 'డాక్టర్ వాలెస్' మరియు 'ప్రొఫెసర్ కే' యభిప్రాయములనే బలపఱచిరి.

5) వికాసవాదమునకు మూలపురుషుడగు డార్విన్‌కూడ నిరీశ్వరవాదికాడు. యోనియుత్పత్తి క్రమమునుగుఱించి తెలుపుచు తనపుస్తకముయొక్క ప్రథమ సంస్కరణలో నిట్లువ్రాసినాడు.

"I should infer from analogy that all the organic beings have descended from some one primordial form into which life was first. breathed."

కాని అదేపుస్తకముయొక్క ద్వితీయ సంస్కరణలో పై వాక్యముల సవరించి యిటులవ్రాసినాడు.

"There is a grandiar in this view of life having been originally breathed by the creator into a few forms or into one," (Origin of specie. by Charles Darwin)

సంస్కరించిన వాక్యములలో జీవము నూదువాడు సృష్టి కర్తయనివర్ణించి, డార్విన్ ఈశ్వరుని యస్తిత్వమంగీకరించినాడు.

'టిండల్' యనునతడు 'వేల్ఫోస్టు'లో నొసంగిన తనయుపన్యాసములో డార్విన్ ప్రయోగించిన "యాదిమ యోని" (Primordial form) పై యాక్షేపణతెలిపినాడు. ఏ యాధారముపై 'డార్విన్' యీకల్పన గావించినాడని యాతని యాక్షేపణ

(Lectures and Essays, by Tyndall, P. 30)

వికాసవాదమును గురించి పై నుదహరించిన వానివలన, నీవాదములో ననేకలోపము లున్నవని తెలియుచున్నది. ఇందు రెండుసిద్ధాంతములు మిక్కిలి యాక్షేపనీయములుగానున్నవి.

1 ఒకయోనినుండి మరొకయోని జనించునను యోని పరివర్తనా సిద్ధాంతము.

2 జ్ఞానవికాస సిద్ధాంతము.

ఈ కారణముననే పలువురు వైజ్ఞానికులు దీనికి నేడువ్యతిరేకులైనారు. అగుచున్నారు. 'ఈశ్వరీయ జ్ఞానప్రాప్తి' యను సిద్ధాంతమునకు హానికలిగించిన నీయత్నము నిష్ఫలమైపోవుచున్నది. అందుచే దాని నిక నధికముగా చర్చింపక "ఈశ్వరీయజ్ఞాన"మను ముఖ్యవిషయమును పరిశీలించెదము.

## ఈశ్వరీయజ్ఞానము:

ఈశ్వరునిద్వారా జ్ఞానము లభించుననుటకు మూడు కల్పన లున్నవి.

1. మొదటి కల్పన : జగదారంభమున ఈశ్వరీయ జ్ఞానావశ్యకత యుండును. ఆనాటి ప్రాచీనసమాజములో ఋషులుండరు. ఈశ్వరీయజ్ఞానమే యాపని గావించును. ధార్మికయుఋషుల యభిప్రాయముకూడనిదియే. ఋషి దయానందుడుకూడా దీనిని బలపరచినాడు. ఆర్యసమాజ మీసిద్ధాంతమును సమర్థించుచున్నది.

2. రెండవ కల్పన : ఆయా సమయములందు మహాపురుషులద్వారా, విశేషగ్రంథముల ద్వారా ఈశ్వరీయ జ్ఞానము జనించును. ఇది రెండవకల్పన. క్రైస్తవులు, మహమ్మదీయులు, యూదులు మొదలగు సాంప్రదాయముల వారి యభిప్రాయమును సమర్థింతురు. మొదట నొసంగబడిన ఈశ్వరీయజ్ఞానము(ఇల్హాం) రెండవది రాగానే రద్దయిపోవునని (చెల్లనేరదని) వీరునమ్ముదురు. ఇట్టిదే సెమిటిక్ ప్రజల యభిప్రాయము ఈశ్వరుడు మఱియు నాతనిజ్ఞానము, నిత్యమై మార్పుగాంచనట్టిది సర్వజ్ఞుడగు నీశ్వరుడు మొదటనొసగిన జ్ఞానము, రెండవసారి యిచ్చినజ్ఞానము వలన, పనికిరానిదెటులగును?

'ప్లేటో' యిటుల జెప్పియున్నాడు. "పరమాత్మని కర్మలు జ్ఞానము రెండును సంపూర్ణసత్యములు మఱియు సరళములు. వానినాతడెన్నడును పరివర్తన గావించడు. జాగ్రత్స్వప్నావస్థల లోను, తన యాజ్ఞలచే నెవరినికూడా నెన్నడును మోసగింప జాలడు."

ఈ యభిప్రాయముల నాతడు తనగ్రంథములో పలుచోట్ల తెలిపియున్నాడు.

(God is perfectly simple and trutn both in deed and word. He changes not, He decieves not, either by dream or waking vision by sign or word?— Plato's Phaedo)

మూడవ కల్పన : పుస్తక సహాయము లేకుండగనే మహా పురుషులద్వారా, ఆయా సమయములందు ఈశ్వరీయ జ్ఞానము లభించును. బ్రహ్మసమాజము మొదలగు వారిటుల తలంతురు. ఇదియే సత్యమైనదని వారినమ్మకము.

జగదారంభమున మానవావసరముల పూర్తిగావించుటకొక సారి ఈశ్వరీయజ్ఞానము లభించినపిమ్మట, మరల మరల జ్ఞానము లభించునను కల్పనచే పరమాత్ముని సర్వజ్ఞత్వమునకు కళంకము గలుగుచున్నది.

ఒకసారి యివ్వబడిన ఈశ్వరీయ జ్ఞానము (ఇల్హాం) రద్దు అయిపోవుటగాని, సంస్కరణ గావింపబడునునుటగాని, లేక దాని స్థానమున మరొకటివ్వబడినదని భావించుటగాని, సరియైనదికాదు. అటుల భావించుటచే నీశ్వరత్వమునకే హానికలుగును. కావున, రెండవ, మూడవ కల్పన లంగీకరింపదగినవి కావు. మొదటికల్పనను గురించిన విషయములు ద్వితీయాధ్యాయములోచర్చింపబడును.



# ద్వితీయాధ్యాయము



## వేదము - వేదవిషయములు

సృష్టి నియమశాస్త్రము : భూమియొక్క ప్రత్యేక భాగములనెఱుగుటకు 'భూగోళము' మఱియు 'అట్లస్' [భూచిత్రపటము] యెంతయవసరములో, యటులనే సృష్టివిషయముల గ్రహించుటకు 'సృష్టి' యను చిత్రపటము, 'వేదము' లను శాస్త్రములవసరముతై యున్నవి వేదములు 'సృష్టి నియమశాస్త్రము' లని గ్రహింపవలెను

సృష్టి నియమశాస్త్రములో నదీ పర్వతాది విషయములేకాక జగత్తు మఱియు ప్రాణుల నున్నతిగావించు నియమములుండ వలయును కేవలము జగత్సంబంధ విషయములేగాక జగత్తును సుఖ శాంతిప్రదముగ నొనర్చు విధిజ్ఞానముకూడా దానిలోనుండ వలయును. ఇట్టిది వేదముతప్ప మరొకటిలేదు. అందుచే జగదారంభమున వేదముండవలసిన యావశ్యకత యెంతయోకలదు

డాక్టరు వాలెస్ ఒకచో నిటుల వ్రాసియున్నాడు. "జగద్వ్యవస్థా నియమములు మఱియు జగత్కార్య విధాన నియమములను వేదఋషులు తెలిపియున్నారు. అట్టి నియమములు జగదుత్పత్తికి పూర్వమే యవసరమై యున్నవని వారు గ్రహించిరి."

(Cosmology of the Rigveda, by H. W. Wallace.)

వేదములద్వారా యీ నియమములు ప్రకటింప బడినవని

డాక్టరు వాలెస్‌గారి యభిప్రాయము. అందుచే దేశములు జగదారంభములోనుండుటకావశ్యకమని పైన చెప్పబడినది

మరొక విద్వాంసుడు క్రిందివిధముగా దెలిపియున్నాడు "ఈశ్వరీయకృత గ్రంథములు రెండు 1- ప్రాకృతిక నియమ రూపగ్రంథము 2- మస్తిష్కములోగల్గు ప్రాకృతిక నియమములు. జగన్నిర్మాతయొక్క జ్ఞానము, బలము మరియు దయ బ్రహ్మాండములోని ప్రతిపదార్థమున స్వర్ణాక్షరములతో నంకితమై యున్నవి"

( Leader dated 10 4-1906, Page 5 )

మరొక రెండువురి యభిప్రాయముల నెఱుగుటవసరమై యున్నది. అందు మొదటిది ఫ్లింట్ మహాశయుని యభిప్రాయము. అతడిట్లు వ్రాసియున్నాడు. "ప్రకృతినియమములు, జగద్రచనా కార్యములు మరియు దైవకటాక్షము, ముక్తిసాధనములను ఈశ్వరజ్ఞానేచ్ఛాదుల బ్రకటించుటకు సరిపోవు గంభీర పరిశోధనము, మేధాశక్తి సాధించుకార్యములు, ఈశ్వరీయ జ్ఞానసహాయముచేతనే నెరవేరగలవు"

( Theism, by R. Flint, P. 302. 310 )

ఇక రెండవ యభిప్రాయము జర్మనుదేశీయ ప్రసిద్ధదార్శనికుడగు "కాంటు" మహాశయునిది. అతడిట్లు వ్రాసియున్నాడు "ఈశ్వర ప్రదత్త జ్ఞానము మొదట లభించినందువల్లనే, లోకములో నియమాచార వ్యవహారములలో పవిత్రత మరియు తాత్త్విక జ్ఞానములో పరిపూర్ణత గలిగినది. అట్లు లభించనిచో నివియు నట్లుండ కాజాలవను విషయమంగీకరింపవలెనే. (Kant)

ఇట్టివనేక కారణము లుండుటచేతనే, వేదము అపౌరుషేయములని, భారతీయుల ప్రాచీనకాలమునుండి నేటివఱ కంగీకరించుచున్నారు.

ఈ యభిప్రాయమునే 'వేదము' ప్రతిపాదించుచున్నది.

"తస్మా ద్యజ్ఞాత్సర్వ హుతః ఋచస్సామాని జజ్ఞిరే।
ఛందాంసిజజ్ఞిరే తస్మాద్యజు స్తస్మాదజాయత॥
[యజు. 31-7; ఋ 10-10-8; అథ. 19-6-131]

"సర్వహుతుడగు యజ్ఞస్వరూపుడగు పరమాత్మనుండియే ఋగ్వేదము, సామవేదము, జనించినవి. అతనినుండియే యజుర్వేదము, అథర్వణవేదమును పుట్టినవి."

"యస్మాదృచో అపాతక్షన్ యజుర్యస్మాదపాకషన్।
సామానియస్యలోమాని అథర్వాంగిరసోముఖం।
స్కంభం తం బ్రూహికతమః స్విదేవసః"॥
అథ. 10-7-20

"(ఋచః) ఋగ్వేదమెవనినుండి వెలిసినదో, (యజుః) యజుర్వేదమెవనినుండి జనించినదో, (సామాని) సామవేద మెవనిలోమములవలెనున్నదో, (అథర్వాంగిరసః) అథర్వవేద మెవనిముఖమో, (స్కంభం) ఆ ఈశ్వరు డెవడో తెలుపుము.''

"సవా ఋగ్భ్యోఽజాయత, తస్మాదృచోఽజాయత"॥
అథర్వ 13-4-38

"ఆ ఈశ్వరుడు (ఋగ్భ్యః) వేదములతో (అజాయత) ప్రకటమయ్యెను, (తస్మాత్) ఆ యీశ్వరునుండియే (ఋచః) వేదములు (అజాయత) పుట్టినవి.

ఋగ్వేదము (10-10-9) మఱియు అథర్వవేదము (10-7-20) లలోను నింకాననేక వేదమంత్రము లందును పరమాత్మ నుండియే వేదములు ప్రకటింపబడినవని తెలుపబడినది.

ఫిలిఫ్ అను మహాశయుడు "Teachings of Vedas" అను పుస్తకములో 231వ పుటయందిటుల వ్రాసినాడు.

"వేదానుయాయులగు నార్యుల యున్నతాభిప్రాయములకు కేంద్ర మాదిమ యీశ్వరీయజ్ఞానమే."

డాక్టరు "ఫ్లీమింగ్"కూడా యీశ్వరీయజ్ఞానప్రాప్తి సిద్ధాంతము సమర్థించి యున్నాడు.

"If we are to obtain more solid assurances it cannot come to the mind of man groping feebly in the dim light of unassisted reason. But only by a communication made directly from this Supreme Mind to the finite mind of man." (Science and Religion — by Seven Men of Science, Lecture by Dr. Fleeming)

జడవాదియగు 'హైకెల్'కూడా 'ఇల్హామ్' (ఈశ్వరీయజ్ఞానము) యొక్క సంభావమంగీకరించినాడు. అతడిటుల వ్రాసినాడు. "ఈశ్వరుని సత్తానంగీకరించినచో, నీశ్వరునిద్వారా జ్ఞానప్రాప్తి జరుగుననుటలో నెట్టి విజ్ఞాన విరుద్ధ విషయముండజాలదు." అతని వాక్యములివి:-

"They may or may not receive such information but there is no Scientific ground for dogmatism on the subject nor any reason for asserting the inconceivability

of such a thing" (T. O. Mazina, quoted in the Materialism by Dorah Dinah Ranga P 52)

అమెరికా నివాసియగు "థామస్ పేన్"యను ప్రసిద్ధవిద్వాంసుడు 'బైబిల్' యీశ్వరదత్త జ్ఞానముకాదని ఖండించియున్నాడు "బైబిల్"యొక్క లేఖకులు దానినెటుల సంకలనము చేయవలెనో యెఱుగలేకపోయిరని యతడు ఋజువుపఱచినాడు. ఇల్హామ్(ఈశ్వరీయదత్తజ్ఞానము)ను గుఱించి యాతడు చూపినయుక్తులు వేదముల విషయములో చక్కగా సరిపడును. అతని యభిప్రాయ మీక్రింద నివ్వబడుచున్నది.

" Revelation is a communication of some thing which the person to whom the thing is revealed, did not know before. For If I have done a thing, or seen it done, it needs no revelation to tell me, I have done it or seen it nor enable me to tell it or to write it. Revelation therefore cannot be applied to any thing done upon earth of which man is himself actor or the witness and consequently all the historical part of the Bible which is almost the whole of it is not within the meaning and compass of the word revelation and there fore is not the word of the God."(Age of Reason P.10-11)

పై వాక్యములలో మానవచరిత్ర లేనిదే యీశ్వరీయజ్ఞానమని స్పష్టముగా చెప్పబడియున్నది. అందుచే వేదములే యీశ్వరీయజ్ఞానమని నిర్ధారణకాగలదు. ఏలనన వానిలో నితిహాసాదులు లేవు.

***

# వేదముల యుత్పత్తి:

ఋగ్వేదములో వేదోత్పత్తినిగురించి యిటుల వర్ణింపబడి యున్నది.

"బృహస్పతే ప్రథమంవాచో అగ్రంతు త్ప్రైరత నామ ధేయం దధానాః। యదేషాం శ్రేష్ఠం యదరి ప్రమా సీత్ ప్రేణాతదేషాం నిహితం గుహావిః॥

(ఋ. 10-71-1)

"ఈశ్వరుడు వేదవాణికిస్వామి. ఆవాణి దేవ్యఋషుల హృదయములలో నుత్పన్నమగును. ఆవాణిని ఋషులు తమహృదయములనుండి బహిర్గత మొనర్చి దానితో వస్తువులకు నామములనొసంగి, యుచ్చరింతురు."

ఈ మంత్రములో జ్ఞానములభించు క్రమమున్నది. జ్ఞానము వాణి(భాష)ద్వారా ఋషులహృదయములలో ప్రకటితమగును జ్ఞానగ్రాహకులగు నాదిమదేవ్యఋషులు దానిని లోకమున వ్యాపింపజేతురు. మన మీకార్యక్రమము నంతఃకరణముయొక్క ప్రేరణగా దలంచగలుగుదుము. మానవుడు సత్కార్యముల జేయిదలంచినపు డాతనిసంకల్పముచే, హృదయమందుత్సాహ సంతోషములు జనించును. దుష్కార్యముల జేయబూనినపుడాతనిలో అనుమానభయాదులు గలుగును. ఈ ద్వివిధములగుకార్యములలో నుత్సాహ నిరుత్సాహాదులు గల్గినప్పుడు వానిని హృదయముతోనే మానవుడు గ్రహించగలడు. వాగ్శ్రవణేంద్రియములకట పనియుండదు. అంతఃకరణప్రేరణవల్లనే ఇదిజరుగును. ఈశ్వరీయజ్ఞానముకూడా

అంతఃకరణ ప్రేరణవల్లనే దైవ్యఋషుల హృదయములలో గల్గును. తమహృదయములతోనే ఋషులు దానిని గ్రహింపగలుగుదురు.

ఋషి దయానందు డంతఃకరణ ప్రేరణను (Conscience) ఈశ్వర ప్రేరణగా నంగీకరించియున్నాడు. "పైథాగరస్" కూడా నిటులనే భావించినాడు.

"But there is a voice of Conscience within us the utterence of Divine law independent of human statutes and traditions, self evident, irrefrigable."
(Science of Language by Max Mullar Vol. II. Page 396)

## 1- 'ఎపిక్యూరస్' అభిప్రాయము :

గ్రీకు దార్శనికుడగు (Epicurus) 'ఎపిక్యూరస్' జ్ఞాన ప్రాప్తి విధానమును గురించి యిట్లువ్రాసినాడు.

"ఈశ్వర ప్రేరణచే మానవుడు మొదట తనకు తెలియకనే భాషాప్రయోగమునుగావించినాడు. నిదురలో కలవరించినటుల, నిరుద్దేశ్యముగా దగ్గుట, తుమ్ముట లేక 'హా'యను విచారసూచక శబ్దములు ప్రకటించినట్లుగా, మానవునినుండి భాషవెడలెను.

(Materialism, by D D. Thanga — P 52)

## 2- ఉపనిషత్తుల యభిప్రాయము :

బృహదారణ్యకోపనిషత్తులో నిట్లున్నది:-

"అస్య మహతోర్భూతస్య నిశ్వసితమేతద్। ఋగ్వేద॥"

ఆ మహాభూతుడగు పరమేశ్వరుని నిశ్వాసమునుండియే ఈ ఋగ్వేదము వెడలినది.

## 3- మాధవాచార్యుల యభిప్రాయము :

మాధవాచార్యులు పరమేశ్వరున కిటుల వందనమాచరించినారు.

"యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్।
నిర్మమే తమహం వందే విద్యాతీర్థం మహేశ్వరమ్।"

'సమస్త విద్యలకు నిధియగు పరమేశ్వరునకు నేను నమస్కరించు చున్నాను. అతని నిశ్వాసమునుండియే వేదములు వెడలినవి. మరియు వేదములతో నాతడు సమస్త జగద్రచన గావించినాడు.'

## 4- శంకరాచార్యుల యభిప్రాయము :

"అతఏవచ నిత్యత్వం" అను వేదాంతసూత్రమునకు భాష్యమువ్రాయుచు శంకరాచార్యులిట్లు తెలిపియున్నారు.

"తతశ్చాతీత కల్పానుష్ఠిత ప్రకృష్టజ్ఞాన కర్మణా మీశ్వరానాం హిరణ్యగర్భాదీనాం వర్తమానకల్పాదౌ ప్రాదుర్భవతాం పరమేశ్వరానుగృహీతానామ్ సుప్తప్రబుద్ధవత్ కల్పాంతర వ్యవహారానుసంధానోపపత్తిః"

జగదారంభమున వేదముత్పన్నమగునని శంకరాచార్యుల యభిప్రాయము. పై సూత్రభాష్యమున నాతడదే యభిప్రాయమును ప్రకటించినాడు సూత్రములో వేదమునిత్యమైనదని ప్రతిపాదింపబడినది వేదమీశ్వరీయజ్ఞానమగుటచే తప్పకయదియునిత్యమైనదే. వేదమీశ్వరీయజ్ఞానమని తలంచినను మానవాభ్యుదయ నిశ్శ్రేయససిద్ధికై కావలసినజ్ఞానము మాత్రమే ఈవేదమనిగ్రహించవలెను. ఇక ఈశ్వరీయజ్ఞాన మనినచో నది యనంతమైనది.

# వేదజ్ఞానము మఱియు భాష:



జ్ఞానప్రాప్తి గలుగు విధమెట్టింగినపిమ్మట, జ్ఞానము భాషతోపాటు లభించినదనువిషయ మెఱుగుటవసరమైయున్నది. భాష లేక విషయమర్థముకాజాలదు. శబ్దజాలము లేకుండ యే నైమిత్తిక జ్ఞానమైనను ప్రకటింపబడజాలదు. అందువలననే మహాఋషిపతంజలి జైమిని మొదలగు తత్వవేత్తలు శబ్దమునిత్యమైనదని తెలిపియున్నారు. 'ప్లేటో'కూడా దీనిని సమర్థించినాడు. 'పైథాగరస్' 'ప్లేటో' మొదలగువారి యభిప్రాయముల నుదహరించి భాషాజ్ఞానములవిభాజ్యములని, మాక్సుముల్లరు ఋజువుపఱచినాడు. ఈయవిభాజ్యతాసిద్ధాంతము భాషావిజ్ఞానమునకుపునాదివంటిదని యతడుతెలిపినాడు. (Science of thought, by Max Muller) భావము లేకుండా శబ్దముండనపుడు శబ్దములేక భావముకూడయుండదనినియంగీకరించుటలో వెనుకముందాడవలసిన పనిలేదని యతని యభిప్రాయము. భావము మఱియు భాష యొకేనాణెముయొక్క రెండు ప్రక్కలు. భావమునుండి భాషను, భాషనుండి భావమును వేఱు జేయజాలము. శబ్దమునువీడి యర్థము, యర్థమునువీడి శబ్దముండుటసంభవము. 'షోలింగ్'యను విద్వాంసుడుకూడా దీనిని సమర్థించినాడు.

"Without language, says Scholling, it is impossible to conceive philosophical, nay. even any human consciousness" (Science of Language by Max Muller) Page, 98.

మనము శబ్దములతోనే భావములను ప్రకటించెదమని 'హీగల్' చెప్పియున్నాడు. ( We think in names ) అథర్వవేద

ములో "దేవస్య పశ్య కావ్యం నమమార నజీర్యతి"యను ప్రసిద్ధ వాక్యముకలదు. ఇందు వేదమును కావ్యమని చెప్పబడియున్నది. "కు, శబ్దే"యను ధాతువునుండి కావ్యము, కవియని శబ్దము లుత్పన్నమగును. కావ్యమనగా శబ్దమయ జ్ఞానమని యర్థము. వేదము పరమేశ్వరునిచే నివ్వబడిన శబ్దమయజ్ఞానము. ఈశ్వరుడు కేవలము జ్ఞానమునే యొసంగినాడు. మఱియు ఋషులు తమశబ్దములలో దానిని ప్రకటించినారను, యభిప్రాయముకూడా నిరాధారమని పై మంత్రభాగమువలన స్పష్టమగుచున్నది. వేద ప్రకటనకు పూర్వము భాషలేకుండెను. ప్రపంచములో వేదభాషయే యతి ప్రాచీనతమభాష.

## వేదభాషకు పూర్వము మరేభాషయు లేదు.

వేదభాషకు పూర్వము మరొకభాష, భూమండలముపై నున్నట్లుకనిపించుటలేదు మాక్సుముల్లరు తనభాషావిజ్ఞానగ్రంథములో (Science of Language) నీ విషయమంగీకరించియు, వైదికభాషను సమస్త భాషలకు జననిగా తలంచక, అగ్రసోదరియని వ్రాసినాడు. భాషలకు జననియగు మూలభాషయేదియో తెలుపజాలకపోయెను. కొందఱు భాషాశాస్త్రజ్ఞులు, వైదికభాషకంటె పూర్వమేదోయొక భాషయుండి యుండునని యూహించుచున్నారు. వారు యిట్లుచెప్పుచున్నారు.

" 'వింశతి'యను సంస్కృత శబ్దము ప్రయోగాధిక్యతచే 'బీస్'యని హిందీకో మారినది. అదేవిధముగా 'ద్వదశతి' యను శబ్దమే ప్రయోగాధిక్యతచే 'వింశతి'యని యేర్పడినది. వైదిక భాషకంటె పూర్వమున్న యొకానొక కల్పితభాషలో నీ 'బీస్' శబ్ద

మునకు 'ద్వివశతి'యను శబ్దము ప్రయోగింపబడుచుండెడిదని గ్ర హించవలెను."

ఇది వారియభిప్రాయముకాని యీ 'ద్వివశతి'యను శబ్దము కూడా వైదికభాషదేయని వీరు గ్రహింపలేక పోవుచున్నారు. అది వేరొకభాషదని సూచించుట మిక్కిలి యనుచితము. భూమండల మునగల యతి ప్రాచీన తమభాష వైదికభాషయేయని ఋజువగు చున్నది. దీనికన్న పూర్వము మరొకభాషయున్న ట్లగపడ సంభవిం చుటలేదు. కనిపించుననుటయును నసంభవమే

<u>భాషోత్పత్తి</u> : భాష ఈశ్వరదత్తముకాదని భావించువారు మాన వుల వ్యవహారములవలన సదిన్వయముగా నుత్పన్నమైనదని చెప్పు దురు. 'లాక్' అను నతడీవాదము నంగీకరించువారిలో నొకడు 'ఆడమ్‌స్మిత్'యను నతడు దీనిని సమర్థించినాడు. ఈ వాదమును "Theory of Convention" యందురు. దీనియభిప్రాయమిది.

1 ప్రారంభమున మానవులు మూగవారు. శరీరావయవ ములతో సంకేతము లొనర్చువారు. తమ భావముల నెరిగించెడి వారు. చేతి సైగలు, మూతివిరుపులు మొదలగునవి యట్టిసంకేత ములలో ముఖ్యములు. పిమ్మట పరస్పరాభిప్రాయములతో గొన్ని చిహ్నముల గల్పించుకొని వానికర్థముల నిర్ణయించుకొన్నారు. ఇ టుల భాషయేర్పడినది.

ఈ వాదములో గొప్పదోషమున్నది. శబ్దము అర్థములేని ప్రాచీనకాలమున, నేభాషలో నాదిమమానవులు మాట్లాడుకొనిరి? భాషయేలేనపుడు భావప్రకటన యెట్లు సాధ్యమగును. (సంకేతముల

తెలియజేయుటకుకూడా భావవినిమయము కావలెను. ఈసంకేతమును శేభాష యేయని వారెట్లు, దేనితో నిర్ణయించుకొనిరి?) ఆదిమ మానవులు మూగవారేయైన, వారేభాషనుకూడా మాట్లాడజాలరు. ఈ సిద్ధాంతములో నీదోషముకలదు.

2 మఱొకవాదమున్నది అందిట్లుగలదు:- "ఆదిమమానవుడు మాట్లాడనారంభించినపుడు తన సమీపములోనున్న ప్రాణుల ధ్వనులననుకరించినాడు. తాననుసరించిన జంతువుల ధ్వనిననుసరించి, వానికాధ్వనులనే పేర్లుగాబెట్టినాడు. అట్టి ధ్వనులతోమాట్లాడుటవలన భాషయేర్పడినది".

పశు పక్షులధ్వనులు సార్థకశబ్దములు కాజాలవు. అందుచే భాషోత్పత్తి కీవాదము చెప్పుపద్ధతి సరియైనదికాదు. ఇట్టిధ్వని ప్రాయమైనభాష ప్రపంచములో ప్రచలితమై యెన్నడునులేదు పశు పక్ష్యాదుల యరుపులబోలిన భాషయున్నదనుట కెట్టియాధారము లేదు

3 మానసిక భావములప్రకటించునావేశముచే ముఖమునుండి హఠాత్తుగా శబ్దములు వెడలునని మరొకవాదము చెప్పుచున్నది. ఓహో, వహ్వా, ఛీ, హీ, హా యను నట్టివే శబ్దములుగానేర్పడెనని కొందఱు చెప్పుచున్నారు కాని ఇట్టిశబ్దములు భాషలోనెన్నియున్నవి? వీనితోనే భాషయేర్పడినదనుట పరిహాస్యాస్పదము.

4 బౌ వౌ (Bow Vow) వాదము నాల్గవది. ఇదియును మూడవ వాదమువంటిదే.

ఇట్టివే మఱికొన్నివాదములు భాషోత్పత్తిని నిర్ణయించు కు

కల్పించినారు. ఇవన్నియు నిరాధారములగు కల్పనలే. భాషోత్పత్తి యను క్లిష్టసమస్యను పరిష్కరించుటకు కల్పితవాదనల నాధారముగా జేసికొనుట, మృగతృష్ణతో దప్పిక తీర్చుకొనుట వంటిదే. ఈకల్పన లన్నియు నిస్సారములైనవి. జ్ఞానమువలెనే భాషకూడా యీశ్వర దత్తమని గ్రహించవలెను.

ఋగ్వేదములో నిది స్పష్టముగా తెలుపబడినది.

"యజ్ఞేనవాచః పదవీయమాయంతా మన్వవిందన్నృషిషు ప్రవిష్టాం। తామభృత్యా వ్యదధుః పురుత్రా తాసప్త రేభా అభిసంనవంతే॥"

ఋ- 10-71-3

(యజ్ఞేన) యజ్ఞపురుషుడగు పరమాత్మ నుండి, (వాచః, పదపయీ) వాణితో పొందదగు జ్ఞానమును (అయన్) పొందుదుము (ఋషిషు) వేదములను గ్రహించిన ఋషులయందు (ప్రవిష్టాం-తాం) ప్రవేశించిన వేదవాణిని (అన్వవిందన్) పొందెదము అనగా ఋషులవలన నితర మానవులా భాషను పొందెదరు. (తాం) అభాషను (ఆభృత్య) పొంది (పురుత్రా) అనేకులలో వారు దానిని (వ్యదధుః) వ్యాపింపచేయుదురు. (తాం) ఆభాషను (రేభా) శబ్దమయమగు గాయత్ర్యాది సప్తఛందస్సులతో (అభిసంనవంతే) పొందుదురు.

ఈమంత్రములోని భావము స్పష్టముగానున్నది. వేద గ్రాహకులగు ఋషులు వేద జ్ఞానముతోపాటు భాషను కూడా పరమేశ్వరునుండియే పొందుదురు. వారినుండి యితరులు భాషనేర్చి దేశదేశాంతరములందును, ద్వీపద్వీపాంతరములందును దాని ప్రచారము గావింతురు.

## సంస్కృత భాష:

వేదము వైదిక భాషలో నున్నది. ఆర్యజాతి వేదజ్ఞానము ను బొంది సమస్త భూమండలముపై వ్యాపించినది వారు వెళ్ళిన ప్రతిచోట దేశములను పట్టణముల నేర్పరిచినారు. వైదికభాష తన జన్మస్థానమునుండి యతియూరపేగి చిరకాలమువఱకు వేరుగా నుండుటవలన భాషాభేదములు కలిగినది. భాషాభేదము జనించుటచే రోమన్, గ్రీక్, జర్మన్, అంగ్ల, ఫ్రెంచి మొదలగుననేక భాషలీ వైదికభాష నుండియేర్పడినవి పార్సీ మొదలగు భాషలవలె సంస్కృతముకూడా వైదికభాషనుండి జనించినది. వైయాకరణులు తమ కాలపుభాషను సంస్కరించి నేటిప్రచలిత సంస్కృతరూపము నేర్పరిచిరి. సంస్కరింపబడిన భాషయగుటచే దీనిని సంస్కృతమనినారు.

## వ్యాకరణ గ్రంథములు

దేశములోననేక వైయాకరణులేర్పడినారు. వారు వేరువేరుగా వ్యాకరణగ్రంథముల రచించిరి వానిలో కేవలము మూడు ప్రాచీన వ్యాకరణ గ్రంథములే నేడు లభ్యమగుచున్నవి. 1. శాకటాయను నిఃబ్ధానుశాసనము. 2. పాణినిఅష్టాధ్యాయి. 3 పతంజలి మహాభాష్యము.

ఈగ్రంథములలో సంతనుపూర్వమున్న, ఇంద్ర, సిద్ధనంది ఆర్యవజ్ర, కాశ్యప, గార్గ్య, గాలవ, చాక్రవర్మన, శాకల్య, భారద్వాజాదులను వైయాకరణులనామములున్నవి. వైదికభాషను ప్రయోగించుటలో నీవయాకరణులనేక పరివర్తనల గావించిరి ఆపరివర్త

నలే నేటికి ప్రయోగింపబడుచున్నవి ఈసంస్కృతజలఫలితముగా, సంస్కృతము ప్రపంచములో సమస్త భాషలకత్యుత్తమ శిరోరత్న ముగా విరాజిల్లుచున్నది.

## సంస్కృత భాషను గూర్చి పాశ్చాత్యుల యభిప్రాయము :–

'సంస్కృత సాహిత్య'మను గ్రంథములో మ్యాక్సుముల్లరిటుల వ్రాసియున్నాడు:–

"శబ్దవిభాగ మొనర్చుటలో గ్రీకువిద్వాంసుల కెంతోకాలము పట్టినదనువిషయముప్రసిద్ధమైనది. ప్లేటో కేవలము నామ, అఖ్యాత ముల (క్రియల)నే యెఱిగియుండెను. అరిస్టాటిల్ "Conjunction" మఱియు "Artical" ను కూడా తెలిసికొన్నాడు. 'జైనోడోటస్' సర్వనామముల జ్ఞానముచు సంపాదించెను. కాని "అరిస్టార్కస్" [150 కీ పూ.] ఉపసర్గలనుకూడా తెలిసికొనెను కాని వేదవ్యాకరణములగు "ప్రాతిశాఖ్యల"లోని వన్నియు సంపూర్ణముగా నుండుట నొక విలక్షణమైనవిషయము. ప్రాతిశాఖ్యలవలన జ్ఞానమును పొంది, పాణిని మహర్షి తన రచనలలో వానివలన చాలా సహాయము గాంచినాడు.

(The Sanskrit literature, by Max Muller, P 77-82)

'ఎడిలింగ్'యను విద్వాంసుడు పరిశోధించి, ప్రాచ్య పాశ్చాత్యభాషలలో నొక వందభాషలకు సంస్కృతము జననియని తెలిపి యున్నాడు. లాటిన్, గ్రీక్, జర్మన్ భాషాపరివారముల కతిసామీప్యజనని (Immediate Parent) సంస్కృతమని చాటినాడు.

(The Sanskrit literature, by Adeling, P. 38-40)

ఒకకాలమున సంస్కృతము సమస్తభాషామండలముయొక్క ఏకైక భాషగానున్నట్లు పాశ్చాత్య విద్వాంసు లంగీకరించినారు.

(Eden herg Revew, Vol. II & III, P.43)

పాశ్చాత్య సాహిత్యములో పలుచోట్ల సంస్కృతభాష సంపూర్ణమైనదనియు, అన్నిటికన్న నియమక్రమములు గలదనియు వ్రాయబడి యున్నది. ఇక వేదముల నిత్యత్వమును గురించి విచారింతము.

## వేదములు నిత్యములు :

ఋగ్వేదములో నిట్లున్నది :

"తస్మై నూనమభిద్యవే వాచా విరూపనిత్యయా।
వృష్ణే చోదస్వ సుష్టుతిమ్"॥ (ఋ. 8-75-6)

వేదము ఈశ్వరీయ వాక్యమనియు, నిత్యమనియు నీమంత్రములో తెలదు. వేదాంత దర్శనములో "అత ఏవచ నిత్యత్వం" (వేదాం-1-3-29) యను సూత్రములోకూడ పై యభిప్రాయము సమర్థింపబడియున్నది. మహాభారతములో నిదే విషయమున్నది.

"అనాదినిధనా నిత్యావాగుత్సృష్టా స్వయంభువా।
ఆదౌ వేదమయీదివ్యా యతః సర్వాః ప్రవృత్తయః॥"
(మహాభార. 12-233-24)

సృష్ట్యారంభమున స్వయంభువగు పరమాత్మనుండి వేదవాణి బయల్పడినది. అవినాశ్యము, నాశరహితము, నిత్యము దివ్యము నాద్యంతరహితమునైనది ఆ వేదవాణివలన జగత్తులో సమస్త ప్రవృత్తులేర్పడినవి

మహాభారత మిటులనెను :

"స్వాయంభువ దేవ భగవన్ వేదో గీతస్త్వయా పురా,
శివాద్యా ఋషిపర్యంతాః స్మర్తారోఽస్య న కారకాః॥"

ఓ స్వాయంభువుడగు భగవాన్! పురాతనకాలమున వేదము నీ నుండియే పాడబడినది. శివుడు మొదలుగాగల ఋషులెల్లరు దానిని స్మరించువారలే. వారు దాని కర్తలుకారు.

కుల్లూకభట్టుకూడ దీని నిట్లుబలపరచినాడు :

"ప్రళయకాలేఽపి సూక్ష్మరూపేణ పరమాత్మని వేదరాశిః స్థితః॥"

ప్రళయకాలములోను వేదము సూక్ష్మరూపమున నీశ్వరునియందుండెను.

మేధాతిథి యిటుల వ్రాసినాడు :

"నైవ వేదాః ప్రలీయంతే మహాప్రళయేఽపి॥"

మహా ప్రళయములోకూడ వేదములు నశించవు.

భగవద్గీత దీనిని సమర్థించుచున్నది :

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం॥"
(గీత. 3-15)

కర్మ బ్రహ్మ (వేదము)నుండి జనించినది. మఱియు వేదము(బ్రహ్మ) నాశరహితుడగు నీశ్వరునుండి యుత్పన్నమైనది.

## సాంఖ్య దర్శనము - వేదము :

కపిల మహాముని సాంఖ్య దర్శనములో ననేక సూత్రము లందు వేదముల నిత్యత్వమునుగుఱించి ప్రసంగించినాడు.

"ననిత్యత్వం వేదానాం కార్యత్వశ్రుతేః" (సాం. 5-45)

వేదముల కార్యత్వము వినుచున్నాము. కావున నవి నిత్యములుకావు "తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే" (య. 31-9) ఈ వేదమంత్రమున వేద మీశ్వరునుండి జనించినట్లు చెప్పబడియున్నది. జనించినది నిత్యమైనదికాజాలదు. అందువలన వేదముకూడ నిత్యమైనదికాదని పూర్వపక్షము వాదన.

సాంఖ్యకారుని యభిప్రాయమీవిషయమున నెట్లుగలదో గ్రహించవలెను. వేదముయొక్క అనిత్యత్వమును ప్రతిపాదించుటకై యవి 'పౌరుషేయము'లని స్వాభావికముగా ప్రశ్నకలుగును. ఈ ప్రశ్నను తిరస్కరించుచు దర్శనకారుడిట్లు ప్రత్యుత్తర మొసగుచున్నాడు.

"న పౌరుషేయత్వం తత్కర్తుః పురుషస్యాఽభావాత్॥" (5-46)

ఈ వేదములకు కర్తయగు పురుషుడెవ్వడులేనందున నవి పౌరుషేయములు కావు.

వేదముల రచించినవానిని జనులు మఱచినారను నూహచే నివి పురుషకృతములని తలంతురేమోయని సమాధాన మిటుల నిచ్చుచున్నాడు.

"ముక్తాఽముక్తయోర యోగ్యత్వాత్॥" (5-47)

ముక్తాత్మలకు మఱియు నముక్తులకు (బద్ధులకు) వేదములు రచించు యోగ్యత లేనందున (వేదములు పౌరుషేయములు కావు.)

ఈ సూత్రమున కపిలాచార్యుడు ముక్తాత్మలకు మఱియు బద్ధులగు సమస్తమానవులకు వేదరచనగావించు యోగ్యతలేదని తెలిపి యవి యపౌరుషేయములని ఋజువుపఱచినాడు.

ఈ క్రింది హేతువులద్వారా యీ విషయమింకను పరిపుష్టమగును.

1 "యథా పూర్వ మకల్పయత్" అను నియమపూర్వకముగా ననాదికాలమునుండి ప్రతి సృష్ట్యారంభమున వేదము ప్రకటమగుచున్నది. పైన చెప్పినవిధముగా సృష్టిప్రవాహముతోపాటు నిది కూడా నిత్యమైనదే. అందుచే వేదములు నిత్యములని యంగీకరించుటవసరము.

2 వేద మీశ్వరీయజ్ఞానము. ఈశ్వరుడు నిత్యుడు. ఆతని జ్ఞానము, క్రియలు మఱియు శక్తి మొదలగునవన్నియు స్వాభావికములైనవి. అందుచే వేదములనిత్యత్వము నంగీకరించుటవసరము

3 ఈశ్వరుడు మఱియు ప్రకృతివలెనే జీవుడుకూడ నిత్యుడు. అందువలన నాతని కళ్యాణార్థ మొసంగబడిన (వేద) జ్ఞానముకూడా తప్పక నిత్యమైనదేయగును.

పుస్తకరూపములో వేదములనిత్యములని యీసాంఖ్యకారుని యభిప్రాయమును పుస్తకరూపములో నుండునది నిత్యమని యెవ్వరంగీకరింపజాలరు. పుస్తకములోనున్న శబ్దమయజ్ఞానమనిత్యమని సాంఖ్యకారుని యభిప్రాయముకాదు. వేదముల స్వతః ప్రామాణ్యమును మఱియు అపౌరుషేయత్వము నాతడంగీకరించియేయున్నాడు.

## వేదములు నిత్యములగుచో వానిలో ఋషులనామములెందుకు?

1 భారతీయులు మఱియు విదేశీయులునగు విద్వాంసులు వేదములలోగల జమదగ్ని, వసిష్ఠాది శబ్దములగాంచి, ఋషుల

నామములతోగల వేదములనిత్యములని తలంచుచున్నారు. మహర్షి జైమిని ఈక్రిందిసూత్రములద్వారా దీనిని సమాధానమొసంగినాడు

"ఆఖ్యాప్రవచనాత్" (పూ. మీమాంస 1-1-30)

"పరంతు శ్రుతి సామాన్యమాత్రం" పూ. మీ. 1-1-31)

వేదములో జమదగ్ని మొదలగుశబ్దములు సామాన్య(యౌగిక) శబ్దములుగా ప్రయుక్తములైనవి. పిమ్మట వానిని జనులు తమ పేర్లుగా పెట్టుకొన్నారు.

2 శతపథ బ్రాహ్మణములో జమదగ్న్యాది శబ్దములు :

వేదములోనున్న జమదగ్ని మొదలగు శబ్దములకు శతపథ బ్రాహ్మణములో నిటులర్థము తెలుపబడినది.

| | | | |
|---|---|---|---|
| జమదగ్ని | = | కన్ను | (శత 8-1-2-3) |
| భారద్వాజ | = | మనస్సు | (శత 8-1-1-9) |
| వసిష్ఠ | = | ప్రాణము | (శత 8-1-1-6) |
| విశ్వామిత్ర | = | చెవి | (శత 8-1-2-6) |
| విశ్వకర్మ | = | వాక్కు | (శత 8-1-2-9) |

ఇదేవిధముగా 'శునశ్శేప' శబ్దమునకర్థము విద్వాంసుడని నిరుక్తములో గలదు. (నిరు. 3-2)

3 ఐతరేయారణ్యకములో ననేక నామముల కర్థమిటుల జెప్పబడినది.

గృత్సమద: గృత్సమనగా ప్రాణము. మద మనగా నపానము. అందువలన ప్రాణాపానములను గృత్సమద మందురు.

విశ్వామిత్ర: సమస్తేంద్రియములు ప్రాణముల నాశ్రయించియుం డును. అందుచే ప్రాణమునకే విశ్వామిత్రయని యర్థము.

వామదేవ: ఇంద్రియము లన్నింటిలో ప్రాణము వంపనీయమైనది ఆకారణమున దానిని వామదేవమందురు.

అగ్ని: ప్రాణము (నిష్కామమైనదగుటచే) పాపములనుండికాపా డును. అందుచే నది యగ్ని యనదును.

భారద్వాజ: వాజ = ప్రజలను (ఇంద్రియముల) భరించి పోషిం చుటచే "ప్రాణము" భారద్వాజమనబడును.

వసిష్ఠ: ఇంద్రియములను వప్పునదగుటచే ప్రాణమే వసిష్ఠుడు.

అగాధ: ప్రాణము శరీరమందంతట ప్రగతమగును. (చేరును) అందుచే దానిని అగాధ మందురు.

పావమానీ: సమస్తేంద్రియముల శుద్ధమొనర్చునది ప్రాణము. ఆకారణమున దానిని పావమానీ యందురు.

4 ఇటుల బ్రాహ్మణ, అరణ్యక, ఉపనిషదాదిగ్రంథములలో వేదములందుగల శబ్దముల కర్థములు తెలుపబడియున్నవి. నిరుక్తము, పూర్వమీమాంస, శతపథాది గ్రంథముల ప్రగాఢముగా నధ్యయనమొనర్చి, వానిపైలి వేదములనర్థము గావించునదనియు వేదములలో ప్రయుక్తమలైన శబ్దములు యౌగికములేకాని, రూఢిపదములుకావనియు, మఱియు వేదములలో నితిహాసము లేద నియు ఋషి దయానందుడు తెలిపియున్నాడు. మాక్సుమూలర్ కూడా ఋషి దయానందుల యభిప్రాయానుకూలముగా మఱియు పాశ్చాత్యుల వాదమునకు విరుద్ధముగా, వేదములలోగన్పడు శబ్దములు ఋషులపేర్లు గావని తెలిపియున్నాడు.

5. సాయణాదులుగావించిన యర్థముల గ్రహింపక, వైదిక ఋషుల హృదయములలోనున్న యర్థముల వెదుకుటయే, వేదార్థముగావించు యుద్దేశ్యమని "రాథ్" తన ప్రసిద్ధ సంస్కృతనిఘంటువుయొక్క ప్రథమభాగమునందు ప్రారంభమున (పే. 4-6) తెలిపియున్నాడు.

సాయణాదులు తమకాలములోగల యభిప్రాయముల ప్రతిబింబములనే వేదములందుగాంచిరి. సత్యమైన వేదార్థమును చిరకాలమునుండి పండితులు మఱచిపోయినారు. తమ తమ కాలములలోగల యభిప్రాయములనే, వారు వేదముల యర్థమువ్రాయునప్పుడు తెలిపియున్నారు. "గోల్డ్‌స్టూకర్" అనునతడు "రాథ్" ప్రకటించిన యభిప్రాయమున కసమ్మతి తెలిపెను. కాని హ్విట్నీ (on the translation of the Vedas, by Whitney) లో మఱియు మ్యూర్ అనునతడు, on the interpretation of the Veda, by J Muir లోను, వెబెర్ అనునతడు 'Indian Wisdom,' అను గ్రంథములోను "రాథ్" యొక్క యభిప్రాయముల స్వీకరించియున్నారు.

వేదములు - పాశ్చాత్య విద్వాంసులు :

సామాన్యముగా పాశ్చాత్యవిద్వాంసులెల్లరును, వైదిక సాహిత్యము మఱియు వేదములయెడ నన్యాయము గావించినారు. ఏకొందఱో విద్వాంసులే కొన్నివిషయములందో సదభిప్రాయమొసగినను, మొత్తముమీద వారుకూడా నన్యాయము గావించినవారిలో లెక్కయే. ఉదాహరణకు కొందఱు పాశ్చాత్యుల చమత్కారబుద్ధుల దిగ్దర్శన గావింపబడుచున్నది.

తన వేదానభిజ్ఞతను చాటినాడు. వేదము నెఱుంగనివారు కూడా వేదమును విమర్శించుట కర్హులమని తలంచుచున్నారు.

2 ఈశ్వరస్తుతి సంబంధమైన మరొక ప్రసిద్ధ వేదమంత్ర మిట నివ్వబడుచున్నది.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేకఆసీత్ సదాధార పృథివీం ద్యాముతే మాం కస్మై దేవాయ హవిషా విధేమ॥"

"ప్రారంభమున హిరణ్యగర్భుడు. (సమస్త ప్రకాశవంతములగు లోకములు గర్భమునందు కలవాడు) ఉద్భవించిన జగత్తున కేకైకప్రభువైనవాడుండెను. అతడు సర్వప్రకాశకాపృథ్వి లోకముల ధరించెను. అతనినే మనము భక్తితో నుపాసింపవలెను."

ఈమంత్రములో నీశ్వరునిగురించి యెంతో యుత్తమముగా చెప్పబడియున్నది. కాని మ్యాక్సు ముల్లర్ "హిరణ్యగర్భ" శబ్దమునకు "గ్రుడ్డు" అని అర్థమువ్రాసి మంత్రార్థమును మట్టిపాలు వొనర్చినాడు.

3 మరొక యుదాహరణనొసంగి యీ ప్రకరణమును ముగింతును.

వేదములో "అజ ఏకపాద్" అను వాక్యమనేక స్థలములందున్నది. ఉదాహరణకు: "శన్నో అజ ఏకపాద్దేవో" (ఋ 7-35-13). దీనియర్థమిట్లున్నది. "(ఏకపాత్) జగద్రూప పాదము గలవాడు. అనగా తనయొకేయంశమున సర్వజగత్తుగల, ఆ(అజ)

అజన్ముడనగు, (దేవః) ఈశ్వరుడు, (శంనః) మాకు కళ్యాణము గూర్చుగాక."

"అజ ఏకపాద్" యను సమాసమునకు "అజస్య ఏకపాదే" యని అర్థము. అనగా నజన్ముడగు పరమేశ్వరుని యొకయంశమున నీసర్వజగమున్నది. కాని 'గ్రిపిత్' యనునతడీవాక్య మున్న ప్రతిచోట "ఒంటికాలుగల మేక" (one footed goat) యని యర్థమువ్రాసినాడు. 'టి. పి. ఏయర్' కూడ ననుకరించి (Riks) (రిక్సు) యను గ్రంథములో పై వాక్యమువచ్చిన స్థలములలో "నొంటికాలు మేక" యనియే వ్రాసినాడు.

ఇటుల నీపాశ్చాత్యు లనేకస్థలములందు నుత్తమార్థముల కనర్థములు గావించినారు. అందుచే పాశ్చాత్య గ్రంథములపఠించునపుడిట్టి యనర్థవిషయములుగలవానిని, భారతీయ విద్వాంసులతో నిర్ణయము గావించుకొనుచుగా ప్రమాణములుగా నంగీకరించవలదని పాఠకులకు వినమ్రతతో నివేదించుచున్నాము.

## వేదమంత్రములు ఋషికృతములా ?

వేదమంత్రముల పై మంత్రద్రష్టలగు ఋషులనామములు వ్రాయబడుటాచారముగా వచ్చుచున్నది కొందఱువిద్వాంసులా ఋషులను మంత్రద్రష్టలనక, మంత్రకర్తలని తలంచుచున్నారు.

Original Sanskrit Text Vol. III లోని మూడవప్రకరణములో "మూర్" దాదాపు 80 మంత్రముల నిచ్చియున్నాడు. వానిలో 'కృ' మఱియు 'తక్ష' ధాతువుల ప్రయోగము కలదు.

4 తై. ఆర. 2-9-1 లోనిట్టివే యాస్కవస్యుల వాక్యములు లభించును.

"అజానహ వై పృశ్నీన్ తపస్యమానాం బ్రహ్మ స్వయ మ్భ్వభ్యానర్షత దృష్యయోఽభవత్ తదృషీణా మృషిత్వమ్"

(స్వయంభూ) ఎవరిచే రచింపబడని స్వయముగా నీశ్వరుని ద్వారా ప్రకటమైన వేదము (బ్రహ్మ)ను, (అభ్యానర్షత) చదువ కనే, తమవిశేష, తపోకారణమున ఋషులు చూచిరి. ఇదియే ఋషుల ఋషిత్వము.

5 "ఋషిగతౌ" అను ధాతువునుండి ఋషి శబ్దమేర్పడును. ఋషిదయానందుడు ఉణాదికోశములో దీనికిట్లుఅర్థము వ్రాసినాడు

"ఋషతి గచ్ఛతి. ప్రాప్నోతి జానాతివాస ఋషిః"
(ఉణాదికో. 4-12)

6 నిరుక్తములో నిట్లున్నది.

"సాక్షాత్కృత ధర్మాణో ఋషయోబభూవుః తేఽవరేభ్యోఽ సాక్షాత్కృత ధర్మేభ్యః ఉపదేశేన మంత్రాన సంప్రాదుః"
(నిరు 1-65)

'ధర్మమును సాక్షాత్కార మొనరించుకొనువారు ఋషులు. వారు ధర్మమును సాక్షాత్కార మొనరించుకొని వారికిమంత్రములు నుపదేశించినారు

పై యుదాహరణలు ఋషుల మంత్రద్రష్టలనుటను స్పష్ట

లనియు సూత్రాభిప్రాయము. ధర్మసూత్రములు, స్మృతులు సన్నియు కూడా వేదమంత్రముల 'ఆనుపూర్వీనిత్యము'లని (పూర్వము వలెనే యుండుటచే నిత్యములని) యంగీకరించుచున్నవని బాదరాయణుడు సూత్రాంతముగా ప్రకటించియున్నాడు.

## వేదములు నాలుగు :

మొదట వేద మొక్కటియేయని విష్ణుపురాణము మఱియు మహాభారతము మున్నగు గ్రంథములలో వ్రాయబడియున్నది వ్యాసుడు మఱియు నాతనిశిష్యుడగు వైశంపాయను డీవేదమును నాలుగువిభాగములుగా విభజించి వానికి ఋగ్వేదాదులని పేర్లుపెట్టి రనియును పై గ్రంథములలో కలదు కాని యీయభిప్రాయము భ్రమమూలకమైనవి. ఈ పురాణములలోనే మఱొకచోట బ్రహ్మ యొక్క ముఖమునుండి నాలుగువేదములు పుట్టినవని కలదు వేరొకచోట వేద మొకటియే యనియున్నది. ప్రతివేదములో మిగ తామూడువేదముల పేర్లున్నప్పుడవి నాలుగనుటలో సందేహమేల? మహాభారతములోనొకచోట వేదమొకటేయనియు మఱొకస్థలమున నాలుగనియును కలదు వైదిక సాహిత్యములో చతుర్వేదముల గుఱించి చెప్పినవిషయములు ప్రసిద్ధములు. వానికి విరుద్ధముగా చెప్పుటకు వీలులేదు.

శ్రీరాముడు మఱియు లక్ష్మణుడు కిష్కింధలో నొకపర్వతముపై నున్నప్పుడు, హనుమంతుని మాటవిని రామచంద్రుడు లక్ష్మణునితో నిటులచెప్పినట్లు రామాయణములో నున్నది.

"నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః
నాసామవేద విదుషః శక్యమేవం ప్రభాషితం"
(వా. రామా· 4-3-29)

ఋగ్వేదమును, యజుర్వేదమును మఱియు సామవేదమును నేర్వకుండా నిటులనెవ్వడును మాట్లాడజాలడు.'

వాల్మీకిరామాయణములోని యీశ్లోకమువలన నాకాలమున ఋగ్వేదాదులు వేరువేరుగానున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. అటుపై వేలకొలది సంవత్సరములకాలము తదుపరిగల వ్యాసుని కాలమున నవి యొకటిగానున్నవనియు, వ్యాసాదులు దానిని నాలుగుగా విభాగించిరని చెప్పుమాట లెటులంగీకరింపదగినవి? (ఇట్టి మాటలంగీకరింప దగినవికావు. ఆరంభమునుండియు వేదములు నాలుగేననియు గ్రహించవలెను.)

## వేదములఋషులు, దేవతలు మఱియు ఛందస్సులు:

ఋగ్వేదముయొక్క అనుక్రమణికలో నిటుల వ్రాయబడియున్నది.

"యస్య వాచ్యంస ఋషి, ర్యాతేనోచ్యతే సా దేవతా,
యదక్షర పరిమాణం తచ్ఛందః॥"

మంత్రార్థసూచక వచనము దెలుపువాడు ఋషి, అతనిచే చెప్పబడిన విషయము దేవత, అక్షరముల పరిణామమే ఛందస్సు.

ఋషులనుగుఱించి విపులముగా నింతకుపూర్వమే. వారు మంత్రద్రష్టలని తెలుపబడినది. మంత్రములలోని విషయము దేవతయనబడును. మంత్రములలోని యక్షరముల సంఖ్యాదృష్టితో గాయత్రి మొదలగువానిని ఛందస్సులనెదరు.

## వేదములో భాషాభేదములేదు :

కొందరు పాశ్చాత్యవిద్వాంసులు, మఱికొందఱు వారి ననుయాయులగు భారతీయవిద్వాంసులు చతుర్వేదములలోని భాషలో భేదముచూపి, యవి వేఱువేఱు కాలములందు రచింపబడినట్లు చెప్పుచున్నారు. ఒకేవేదములోని విభిన్నభాగములలో గల్పిత భాషాభేదమునుచూపి, వానిని విభిన్న సమయములందు రచింపబడినట్లు చూపుచున్నారు. ఇదంతయు కల్పితము మఱియు వారియూహలు మాత్రమే ఒకరెండుదాహరణలిటనొసగి వానినాలోచించుట సరియగునని తలంతుము.

'మాక్డోనల్' యనునతడు ఋగ్వేదములోని దశమ మండలమన్నిటికన్నా తదుపరి రచింపబడినదని, దానిభాషలో విభిన్నత యున్నదని వ్రాసినాడు

(Sansk it Literature,by Mac-Donell, p. 44

దశమ మండలమును గుఱించి కావించబడిన యాక్షేపణల విమర్శించుచు శ్రీ పండిత సత్యవ్రత సామశ్రమీ యిటులవ్రాసినారు

"ఋగ్వేదములోని ఇతర మండలములలోనిభాష మరియు దశమమండలములలోనిభాష యొకేతీరుగానున్నది. వానిలోభిన్నత యున్నట్లు మా బుద్ధులకు కన్పించుటలేదు. బుద్ధి మఱియు శ్రోత్రేంద్రియ దోషములవల్లనో లేక హఠముచేతనో, లేక మరెటులనీ నిర్ణయముగావించిరో తెలియదు"

భాషాభేదజ్ఞానము 'సామశ్రమీ'వంటి సంస్కృతవిద్వాంసునకెంతతెలియునో యంత మ్యాక్డోనల్‌కు తెలియదు. ఈ విషయమునకొక సంఘటన తెలుపదలచినాము. కొంతకాలము క్రిందట

నాకభారతీయ సంస్కృతాంగ్ల భాషావిద్వాంసుడు ప్రభుత్వమునుండి యుపకారవేతనముపొందిి, సంస్కృతవిశేషాధ్యయనమున కింగ్లాండు వెళ్ళెను. అపుడు సంస్కృతాధ్యాపకుడుగా నీ 'మ్యాక్డోనల్'గారే యుండిరి. అతడు 'మాక్డోనల్'తో కలువగానే సంస్కృతములో మాట్లాడసాగెను. కాని 'మ్యాక్డోనల్' సంస్కృతములో మాట్లాడ లేకపోయెను. అపుడాగురువు కాబోయే శిష్యునితో నిటులనెను "సంస్కృతములో నీవుసంభాషింపగలయోగ్యత నాకులేదని యంగీకరింతును. మీరిటకు సంస్కృతసాహిత్యము నధ్యయనముగావించుటకు పంపబడలేదు. పాశ్చాత్యవిద్వాంసుల యన్వేషణాప్రణాళిని నేర్చుకొనుటకే మీరిటకు వచ్చినారు."

ఈ సంఘటనవలన సామాన్యముగా పాశ్చాత్యపండితుల యొక్కయు, విశేషించి 'మ్యాక్డోనల్'గారియొక్కయుసంస్కృత భాషాజ్ఞానమెంతటిదో చక్కగానర్థమగును. వేదభాషను గుఱించి పాశ్చాత్యులొసంగు యభిప్రాయముల నేమాత్రము లెక్కించదగినవికావు మఱొకవిషయమిట తెలుపవలసియున్నది. ఈ 'మ్యాక్డోనల్'గారే యీ దశమ మండలమునుగుఱించి ఇట్లువ్రాసియున్నాడు

"అయిన నీదశమ మండలములోనిసూక్తములు చాలావరకు చేర్చినభాగములకన్న ప్రాచీనములుగా, నితర మండలములలోని వలెనే యున్నవి"

( Neverthless the supplements collected in it appear for the most part to be older than the addition which occur in the earlier books– Sanskrit Litera ture, by Mac Done, P. 43-45 )

ఇతరమండలములలో చేర్పులు కూర్పులున్నవా? లేదా?

యను విషయమును ముందుపర్చించగలము. ఇక 'మ్యాక్డోనల్' తన రెండవవ్రాతలో, మొదటతెలిపిన దానిని స్వయముగా ఖండించినాడు. దశమ మండలములోని భాష యితర మండలములలోని భాషకన్న వేరుగాదనియు, ఈ రెండింటిలో భేదము లేదనియు స్పష్టమైనది. ఇటులనే మిగతా వేదములగుఱించి యెఱుంగుట ఉచితము.



# 'వేదత్రయీ' యనగా నేమి?

నాలుగువేదములలో మూడువిధములగు మంత్రములున్నవి. పూర్వమీమాంసలో నిదేవిషయ మిటుల చెప్పబడియున్నది.

"తేషాం ఋగ్ యత్రార్థ వశేన పాదవ్యవస్థా!"
"గీతిషు సామాఖ్యా శేషే యజుః శబ్దః॥"
(పూర్వమీమాంస 2-1-35,37)

అర్థమననుసరించి పాదవ్యవస్థగలవి ఋక్కులనబడును. పాడదగు మంత్రముల సామములందురు. మిగిలినవి 'యజుస్సు' లనబడును. ఈ మూడువిధములగు మంత్రములు చతుర్వేదములందెల్లెడ నున్నవి. 'సర్వాను క్రమణీ వృత్తి' యొక్క భూమికలో 'షడ్గురు శిష్య' లిట్లు చెప్పియున్నారు.

"వినియోక్తవ్య రూపశ్చ త్రివిధః సంప్రదర్శ్యతే ఋగ్ యజుః సామరూపేణ మంత్రోవేద చతుష్టయే॥"

యజ్ఞములలో త్రివిధరూపములగు మంత్రములు వినియోగింపబడును. నాలుగువేదములలో నవి 'ఋగ్' 'యజు' మఱియు 'సామ' రూపములోనున్నవి.

త్రివిధములగు మంత్రము లుండుటవల్లను, వేదములలో జ్ఞాన, కర్మ, ఉపాసనలను త్రివిధ కర్తవ్యముల వర్ణించుటచేతను "వేదత్రయీ"యని యవి చెప్పబడుచున్నవి. 'వేదత్రయీ' యను శబ్దములో చతుర్వేదము లిమిడియే యున్నవి. అథర్వ వేదములో నొకచోట నిట్లుచెప్పబడినది.

"విద్యాశ్చవా అవిద్యాశ్చ యచ్చాన్యదుపదేశ్యం శరీరే
బ్రహ్మప్రావిశదృచః సామాథోయజుః॥" అథ. 11-8-23

విద్య మఱియు నవిద్య. (జ్ఞానము + కర్మ) ఉపదేశింపదగిన నితరవిషయములు. బ్రహ్మ (అథర్వవేదము), ఋక్, సామ మఱియు యజుస్సులు పరమేశ్వరుని శరీరములో ప్రవేశించినవి.

"వ్హిటిసీ"యను పండితుడుకూడా 'బ్రహ్మ' శబ్దమున కథర్వవేదమే యని తెలిపినాడు.

(Brahman perhaps is here the Charm representing in the Atharwan Hymens,) 'Whitney'

అథర్వవేదములో నున్నటులనే ఋగ్వేదములోకూడా చతుర్వేదముల పేర్లున్నవి.

"స్తో అజ్గిరోభిరంగిరస్తమో భూద్వృషా వృషభిః సఖిభిః సఖాసన్। ఋగ్మిభిర్ ఋగ్మిగాతుభిర్జ్యేష్ఠో మరుత్వాన్నో భవద్విన్ద్ర ఊతీ॥" (ఋ. 1-100-4)

అథర్వాంగిరః మంత్రములతో నుత్తమరీతిగానున్నవాడును సుఖవర్ష సాధనముతో సుఖమునువర్షించు వాడునునై, మిత్రులతో మిత్రుడుగా, ఋగ్వేదులతో ఋగ్వేదిగా, సామమంత్రజ్ఞానముతో జ్యేష్ఠుడుగానున్న యాయింద్రుడు(ఈశ్వరుడు)మమ్మురక్షించుగాక

ఈ మంత్రమున 'అథర్వవేదము' యొక్క పేరుస్పష్టముగా పేర్కొనబడినది. ఋగ్వేదము స్వయముగా నథర్వవేదము యొక్క వేదత్వము నంగీకరించగా, దానిని నవీనమైనదనిచెప్పి, దానిని వేదములనుండి వేరుచేయుటసాహసమేయగును.

## బ్రాహ్మణ గ్రంథములు వేదములా!

ఈ ప్రశ్నకు మహాభాష్యకారుడగు పతంజలిఋషి ప్రత్యుత్తర మిచ్చియున్నాడు:

'చతుర్వేద విద్భిర్బ్రహ్మభి ర్బ్రాహ్మణై మహర్షిభిః।
ప్రోక్తాని యానివేద వ్యాఖ్యానితాని బ్రాహ్మణానీతి॥'
(మా భా5-1-1)

"చతుర్వేదముల నెఱింగిన యీశ్వరభక్తులగు బ్రాహ్మణులు మఱియు మహర్షులచే వ్రాయబడిన వేదముల వ్యాఖ్యానములే బ్రాహ్మణగ్రంథములనబడును."

బ్రాహ్మణములు వేదములుకావనియు నవి వాని వ్యాఖ్యానములనియు స్పష్టమైనది. ఈ విషయమున నీక్రింది విషయములు గమనింపదగియున్నవి.

1. బ్రాహ్మణ గ్రంథములలో ననేక వేదమంత్రముల వ్యాఖ్యానము గనిపించును. ఋగ్వేదము 1-24-3 యొక్క వ్యాఖ్య

నము. ఐతరేయబ్రాహ్మణము (1-16)లో గలదు. యజుర్వేదము లోని ప్రథమమంత్ర వ్యాఖ్యానము శతపథబ్రాహ్మణములో (1-7-1) నున్నది. సామవేద ప్రథమమంత్రవ్యాఖ్య తాండ్య బ్రాహ్మణము (11-2-3)లో గలదు.

2 దేశములో స్త్రీలకు, శూద్రులకు గౌరవము తగ్గిన కాలములో బ్రాహ్మణ గ్రంథములు రచింపబడినవి. ఒక బ్రాహ్మణములో నిట్లున్నది:- 1- స్త్రీలు, శూద్రులు, కుక్కలు మఱియు కాకులను యజ్ఞకర్త చూడకూడదు. 2- స్త్రీతో మైత్రి జరుగజాలదు. క్రూరజంతువుల హృదయములవలె యామె హృదయము క్రూరమైనది. 3- పారంపర్యముగా స్త్రీలప్రవృత్తి సాంసారిక విషయములపై మఱియు వ్యర్థపదార్థములపై నధికముగానుండును అందువలన వారు సంగీత నృత్య వాయిద్యముల గావించువారిచే నాకర్షింపబడుదురు.

కానివేదములలో దీనికి విరుద్ధముగా స్త్రీలకెక్కువ గౌరవమర్యాదలు చూసబడినవి. పురుషులకువలె వారికన్నిహక్కులొసంగబడినవి ఋగ్వేదములో నిట్లున్నది.

"ఓం సామ్రాజ్ఞీ శ్వశురోభవ, సమ్రాజ్ఞీశ్వశ్రవాంభవ
ననాందరి సమ్రాజ్ఞీభవ, సమ్రాజ్ఞీ అధిదేవృషు॥"
(ఋ. 10-85-46)

ఈమంత్రముతో వధువునకాశీర్వాదమొసంగబడినది. ఆమె పతి గృహమునకువచ్చి అత్తమామలకు, ఆడబిడ్డ మరిది మొదలగు వారిపై శాసనముగావించు సమ్రాజ్ఞికావలెనని మంత్రమునకలదు.

దీనితో వేదము మఱియు బ్రాహ్మణములలోగల భేదము స్పష్టముగా నెఱుగవచ్చును.

3 బ్రాహ్మణ గ్రంథములితిహాసములు. వానిలో ననేక స్త్రీ పురుషుల, రాజుల, రాణులచరిత్రకలదు, వేదములలోనితిహాసము లేదు అందు యౌగిక శబ్దములేకలవు కావున వానిలో నితిహాసముస్నదనీ కల్పించుటకు వీలులేదు.

వేదముల శాఖలు :

మహాభాష్యము మొదలగు గ్రంథములవల్ల వేదముల శాఖల సంఖ్య యిట్లుతెలియుచున్నది.

ఋగ్వేదమునకు 20, యజుర్వేదమునకు 100, సామ వేదమునకు 999 మఱియు అథర్వవేదమునకు 8, శాఖలున్నవి. ఇటుల శాఖలు మొత్తము 1127. మహాభాష్యాదులలో నివ్వబడిన శాఖలసంఖ్య మూలవేదముల కలుపుకొని కలదు. అందుచే నవి 1131 శాఖలని చెప్పబడినది. ఇందుండి 4 మూలవేదముల తీసివేసిన శాఖలసంఖ్య 1127యగును. నేడు కేవలము ఏదెనిమిది శాఖలు మాత్రమే లభించుచున్నవి. మిగిలినవి నశించిపోయినవి. లభించువానిలో తైత్తరీయశాఖ (కృష్ణయజుర్వేదము) యొకటి. ఇందు వేదము మఱియు బ్రాహ్మణము కలిసియున్నది. క్రమ భేదముగావించి, యజ్ఞముల కనుకూలముగా మిగతాశాఖ లేర్పడి యుండునని చెప్పబడుచున్నది. సామగాన భేదముచే సామవేదమునకు 1000 శాఖలేర్పడినవి. పురాణములలో నీశాఖలగుఱించి పరస్పర విరుద్ధములగు వ్రాతలున్నవి వానిలో శాఖలసంఖ్యాభేదము కూడా చూపబడియున్నది.

వేద రక్షణోపాయములు :

1 ప్రాథమోపాయము: వేదముల రక్షించుటకు గావించబడిన యేర్పాటులలో వేదపాఠము ముఖ్యమైనది. ఎనిమిది విధములగు క్రమపాఠములు ప్రణ్ణించబడినవి.

"అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమ పూర్వామనీషిభిః।
జటా, మాలా, శిఖా, లేఖా, ధ్వజో, దండో, రథో ఘనః"

ఈ ఎనిమిది క్రమపాఠములలో జటా మఱియు దండము ప్రధానమైనవి. జటననుసరించి నడచునది శిఖా, దండము ననుసరించి మాల, లేఖ, ధ్వజ, రథ, పాఠములు నడచును. జటా, దండముల ననుసరించి ఘనపాఠము జరుగును. ఈ క్రమ పాఠములలో కొంచెము భేదముగావించి, ప్రతిమంత్రమునకు పదునొకండు విధములగుపాఠములు గావించువిధాన మేర్పరచబడినది. ఈ పాఠములు నేటికిని, కాశీ, మిథిల, నదియా, బొంబాయి మఱియు మద్రాసు మొదలగుప్రాంతములందు జరుగుచున్నవి. వేదముయొక్క ప్రతి శబ్దము పదకొండేసిమారులుచ్చరింపబడుటచే వానిలోనెట్టి చేర్పులు జరుగుటకు వీలులేదు. ఇచట సామవేదము పాఠముయొక్క సంక్షిప్త యుదాహరణ నిచ్చుచున్నాము. దీనివలన నీపాఠమెటు లుండునో తెలియగలదు.

1 క్రమపాఠము:-

| 1 | 2 2 | 3 3 | 4 4 | 5 5 | 6 6 | 7 7 | 8 |
|---|---|---|---|---|---|---|---|
| భూః; | భువః; | భువః; | స్వః; | స్వః; | తత్; | తత్; | సవితుః; |

2 జటాపాఠము:-

| 1 | 2 | 2 | 1 1 | 2 | 2 | 3 3 | 2 2 |
|---|---|---|---|---|---|---|---|
| భూః | భువః | భువః | భూః | భూః | భువః | భువః | స్వః |

3 4 4 3 3 4
స్వాః భువః భువః స్వాః

3 ఘన పాఠము:-

1 2 2 1 1 2 3 3 2 1 1 2 3
2 3 3 2 2 3 4 4 3 2 2 3
భూః భువః భువః ; భూః భూః భువః ; స్వాః స్వాః

భువః ; భూః భూః భువః స్వాః ।

ఈ పాఠక్రమ మత్యంత ప్రాచీన కాలమునుండి వచ్చుచున్నది. ఐతరేయారణ్యకము మఱియు ప్రాతిశాఖ్యాది ప్రాచీన గ్రంథములలో దీనివర్ణనకలదు ఈ జటామల పాఠనియమము వ్యాడి ప్రణీతమగు 'వికృతివల్లి' యను గ్రంథమున నున్నవి శ్రీ స. సత్యవ్రత సామశ్రమిగారు తమ ప్రసిద్ధ "గ్రంథత్రయీ" పరిచయములో తెలిపినారు.

2 ద్వితీయోపాయము: చతుర్వేదముల ఛందస్సుల సంఖ్యను పదసంఖ్యను, మంత్రసంఖ్యను మఱియు మంత్రానుక్రమముగా ఋషి దేవతా ఛందస్సుల దెలుపుటకు "అనుక్రమణిక" లను గ్రంథములు వ్రాయబడినవి. అవి నేటికిని లభించుచున్నవి. ఒక వేదమున కొకే యనుక్రమణిక కాక, ననేకానుక్రమణికలు నేటికినిలభించుచున్నవి.

1 ఋగ్వేదానుక్రమణికలు: 1) శౌనుకానుక్రమణిక, 2) అనువాకానుక్రమణిక, 3) సూక్తానుక్రమణిక, 4) ఆర్షానుక్రమణిక, 5) ఛందానుక్రమణిక, 6) దేవానుక్రమణిక, 7)

కాత్యాయనీయాను క్రమణిక, 8) సర్వాను క్రమణిక 9) ఋగ్విధాన బృహద్దేవతా.

2 యజుర్వేదాను క్రమణికలు: 1) మంత్రార్షాధ్యాయము 2) కాత్యాయనీయ సర్వానుక్రమణిక, 3) ప్రాతిశాఖ్య సూత్రము 4) నిగమ పరిశిష్టము.

3 సామవేదాను క్రమణికలు: 1) అర్షేయ బ్రాహ్మణము, 2) నైగమేయానామృత్యార్షమ్, 3) నైగమేయానుమృషిదైవతం

4 అథర్వ వేదమునకు: బృహత్సర్వాను క్రమణిక.

ఈ అనుక్రమణికలు గురించి మాక్సు ముల్లరు తనగ్రంథములో విట్లువ్రాసినాడు.

"ఋగ్వేదాను క్రమణికలవలన, దానిలోని సూత్రములను, పదములను పరీక్షించి, కాత్యాయనుని కాలమునుండి నేటివఱకు, ఋగ్వేదమంత్రములు, శబ్దములు మఱియు పదముల సంఖ్య యంతియేకలదని నిస్సందేహముగా తెలుపవచ్చును."

(Ancient Sanaskrit Literature, by Max Muller, P.117)

3 తృతీయోపాయము: అనుక్రమణికలు వ్రాసిన విద్వాంసులు వానికి టీకలనుకూడా వ్రాసి సురక్షిత మొనర్చినారు ఇవియే కాక వేదముల కనేక భాష్యములు వ్రాయబడినవి అవిలభ్యమగుచున్నవి. వానివలనకూడా వేదముల రక్షణ జరుగుచున్నది.

ఇన్ని రక్షణసాధనములున్నను కొందఱు వేదములలో ప్రక్షేప

ములున్నవనెదరు కాని యవి అజ్ఞాతములు కావు. ఎటనెట ప్రక్షేపములున్నవో వేదవిద్వాంసు లెఱుగుదురు ఇటులజెప్పి ప్రక్షేపముల చూపువారిలో శ్రీ పండిత రఘునందనశర్మ యొకరు. వారు తమ "వైదిక సంపత్తి"యను నమూల్య గ్రంథములో దీనిని తెలిపియున్నారు. అందుచే నీప్రకరణము ముగించి యవిషయమును చర్చించుటకు పూనుకొందును.



## వైదికసంపత్తి - వేదములు :



శ్రీ పండిత రఘునందనశర్మ వేదములలో ప్రక్షేతములున్నవని "వైదికసంపత్తి"యను తనగ్రంథములో నొకసమస్యను లేవనెత్తినాడు. అతని యభిప్రాయముల సమగ్రముగా నెఱుంగు టవసరమైయున్నది. ఆతడు "వైదిక సంపత్తి"యొక్క చతుర్థ ఖండములో వేదములగుఱించి యిటుల వ్రాసియున్నాడు.

"సర్వ ప్రమాణములచే నపౌరుషేయత్వము మఱియు నీశ్వరప్రదత్తత, కేవలము ఋగ్యజు సామాథ్వరణములకే లభించును. ఇతరములకుకాదు." (పుట 532)

బ్రాహ్మణ గ్రంథము లపౌరుషేయములు కావనియు, సంహితలకు వ్యాఖ్యానములేయనియు స్పష్టమైన పిమ్మట, అథర్వవేదముకూడా అపౌరుషేయమేయని తేలిన తదుపరి, వేదముల వాస్తవికస్వరూపము నిర్ధారితమగును. అపౌరుషేయములగు వేద

ములు, ఋగ్, యజు, సామ, అథర్వములను నాలుగు మాత్రమే యని తెలియును." (పుట 539)

వేద శాఖలు :

అర్థముల నిశ్చయించుటకు మూలసంహితలను పద పాఠ సంహితలుగా రూపొందించినారు "సంధితోనున్న దానిని 'నిర్భుజ సంహిత యనియు', సంధిలేకుండా కేవలము 'పదముల' యుచ్చారణగలది "ప్రతృణ్ణ సంహిత" యనియు చెప్పబడునని ఐతరేయారణ్యకములో గలదు. (ఐత. అ. 3-13) "యద్ధి సంధివివర్తయతి తన్నిర్భుజస్యరూపమ్ అథ యచ్ఛుద్ధే అక్షరే అభివ్యాహరంతి తత్ ప్రతృణ్ణస్య"

వేదశాఖయొక్క మొదటి రూపమిటులనే యుండెడిది ఇదే యారణ్యకములో నిటులున్నది "ప్రతృణ (పదపాఠ) సంహిత జటా, మాలా మొదలగు భేదములతో విస్తృతమైనపుడు దానిని క్రమ సంహితయు మను." మూలమంత్రములతోపాటుగా వానిపదములు వేరువేరుగానుండి యాపదములలో విస్తృతికూడా జరిగినప్పుడది క్రమసంహిత యనబడునని తెలియుచున్నది.

ఇంతటితోనే శాఖల సమాప్తి జరుగలేదు. బృహద్దేవత ననుసరించి దేవతా, ఋషి, ఛందోభేదములచేతను, అర్థభేదము వలనను సూక్తములలో ననేకభేదములు కలిగినవి. ఇటుల సూక్తముల భేదమున శాఖలసంఖ్య వృద్ధిగాంచినది దేవతాసంబంధసూక్తముల నేకత్రితమొనర్చుటచే నది దెవతశాఖయనియు, ఋషుల గుఱించిన సూక్తములుగలది. యార్షశాఖయనియు చెప్పబడుచుండెను.

"మంత్రములలో నింతక్రిందుమీదులై సను నేటిపటిస మం త్రములలో పాఠభేదముగాని, న్యూనాధికతగాని జరుగలే"దని శ్రీ రఘునందనశర్మగారు (వై. సం. పుట 42) వ్రాసినారు వారే మరొకచోట నిటుల తెలిపియున్నారు. "కృష్ణయజుర్వేదముయొక్క దేవులతో వైదికశాఖలలో కల్లోల మారంభమైనది రావణాదులు గావించిన సాహిత్యమును గలుపుటచే శాఖలలో కలతయేర్పడినది. సంహితలలో బ్రాహ్మణభాగము మఱియు బ్రాహ్మణేతరభాగము కూడాకలిపి మూలమంత్రములు తగ్గించి, హెచ్చించి మఱియు పాఠభేదములుగావించి యనేకశాఖలు సృజించినారు." (పు 543)

ఈశాఖలు రెండువిధములని శ్రీ రఘునందనశర్మగారు తెలిపినారు. అందులోనొకటి "ఆర్యశాఖ" యనియు మరొకటి "అనార్యశాఖ"యనియు పేర్కొన్నారు. "మూల మంత్రములను యథాతథముగా రక్షించుచు, కేవలము మంత్రముల క్రమములో మార్పులుగావించి సిద్ధమొనర్చినవి 'యార్యశాఖలు' మఱియు మంత్రములలో పాఠభేదమొనర్చి, యాసురీసాహిత్యమును, బ్రాహ్మణభాగమును మఱియు కల్పితసంస్కృతభాషనుజేర్చి రచింపబడినవి. "యనార్యశాఖల"ని యందురు. (పు 543)

ఆర్యశాఖలు :

ఋగ్వేదముయొక్క శాకల, వాష్కలశాఖల నార్యశాఖలో నుత్తమయుదాహరణలుగా శర్మగారు పేర్కొనినారు తైత్తిరీయ, కాఠకాదిశాఖ లనార్యమైనవివి తెలిపినారు

ఈ రెండువిధములశాఖల యుదాహరణ లొసంగుచు వారిటులనినారు. "ఆర్యశాఖలలో క్రింద మీదులగుటతప్ప హెచ్చ

తగ్గులలేవు. కాని అనార్యశాఖలలో నీరెండువిషయములు గన్పించుచున్నవి." (పుట 543, 544)

పైన పేర్కొన్న యాజ్ఞశాఖలలో ఋగ్వేదముయొక్క శాఖాకారులలో నొకడు 'శాకలుడు' (శాకల్యుడు) ఇతడు ఋగ్వేదమును మండలములుగా, సూక్తములుగా విభాగించినాడు. ఇతని శిష్యుడు 'వాష్కలుడు.' ఇతడు ఋగ్వేదమును అష్టకాది విభాగములుగా గావించినాడు. వాష్కలుడు, శాకల్యుని తరువాతివాడని తలంచుచున్నారు. ఈరెండు శాఖలత్యంత ప్రాచీనములు. శాకల్యుని విభాగమువలె 'వాష్కలుని' విభాగమును గురించియు రఘునందన శర్మగారిట్లువ్రాసినారు. "ఈవిభాగమువలన మంత్రములసంఖ్యల యందు కెలుమాత్రమేమారినవి మరెట్టిమార్పుయునుజరుగలేదు. అందువలన వైదికులీరెండిటి నొకటిగానేభావించి కలిపివేసినారు. నేటికి నీరెండు శాఖలొకేదానిలో కలసి లభించుచున్నవి. కేవలమితిహాస స్మరణార్థము, రెండువిధముల వర్గీకరణను (మండలములుమరియు అష్టకములు) నేటి ఋగ్వేదము యొక్కపుటలపై వ్రాయుచున్నారు ఈ క్రమమనాదికాలమునుండి వచ్చుచున్నది ఇటులనాదిమ ప్రవచనకర్తచే సిద్ధమొనర్చిన ఋగ్వేదశాఖ నేటికినటులనే లభించుచున్నది దానిలో సంహితయొక్క మూలమంత్రములు పదపాఠములు రెండును కలిపియచ్చు వేయుచున్నారు. అందుచే నాదిమ, యథాతథ మేయ ఋగ్వేదసంహిత సంపూర్ణరూపముగా లభించినదనుటలో నేమాత్రము సందేహములేదు. (పుట 545)

ఋగ్వేదమువలెనే యజుర్వేదశాఖలపై విమర్శవగావించుచు రఘునందనశర్మగారిట్లు వ్రాసినారు. "ఇందువలన మాధ్యందినీయ శాఖ (వర్తమాన శుక్ల యజుర్వేదము) కూడా యాదిమూలము

మరియు నపౌరుషేయమనుటలో స.దేహము లేదు."
(పుట 548)

సామవేదమును గురించి ఇట్లు వ్రాసినారు. ఉత్తర భారతముతో సంబంధముగలిగి సౌరాష్ట్ర (దక్షిణగుజరాతు) వరకు వ్యాపించిన కౌథుమీశాఖ (వర్తమాన సామవేదము) యే ఆర్య శాఖ, అదియే మౌలికమైనది అందుచే కౌథుమీశాఖ మొదటిదనియు నపౌరుషేయమనుటలో నేమాత్రము సందేహములేదు (పుట 549)

అధర్వవేదశాఖలపై విమర్శనా గావించి యిటుల నిర్ణయ మొనర్చినారు. "శౌనకా సంహిత (వర్తమాన అధర్వవేదము) యే యపౌరుషేయమగు మూలవేదము. ఇదియును ఋగ్, యజు, స్సామవేదములతో,పాటు ప్రాచీన కాలమునుండి పఠనపాఠనములలో నున్నది. దానికే భాష్యకారులు భాష్యమొనర్చినారు దానిలోనే వేద లక్షణములన్నియు గన్పించుచున్నవి. అందువలన 'శౌనకసంహిత' యే సనాతనమగు నీశ్వర ప్రదత్త (అథర్వవేద) మనుటలో సందేహములేదు (పుట 550)

ప్రక్షేపములు:

ఇటుల చతుర్వేదములలో న్యూనాధికములు లేవనియు, నవియే యీశ్వరప్రదత్తములనియు నంగీకరించిన పిమ్మట రఘు నందనశర్మగారు వానిలో ప్రక్షేపములున్నవను ప్రశ్న లేవదీసియిటుల వ్రాసినారు. "మనకుదెలిసినంతవఱకు వేదములలో ఫలానాస్థలము ప్రక్షిప్తమని చెప్పు ప్రమాణ మొక్కటియును లభించలేదు. మఱియు దీనినెఱిఁగిన వారెవ్వరును నేటికి లేరు. ప్రక్షిప్తములని చెప్పబడు

స్థలములు చాలాకాలము (బ్రాహ్మణకాలము) నుండి యుంద
ఱకు దెలిసినవే అవి ప్రక్షిప్తములు కావు ఒకవిధముగానవి" పరిశి
ష్టము తే" లేఖకులు మఱియు ముద్రణకర్తలయజాగ్రత్తచే మూల
ములోగలిసి మూ మనలెనే యవిగన్పించుచున్నవి 'వాలఖిల్య సూ
క్తము ఋగ్వే ముకో, ఖిల' మఱియు' బ్రాహ్మణభాగము' యజు
ర్వేదములో, 'అరణ్యకము' మఱియు ' మహానామ్ని'సూక్తములు
సామవేదములో మఱియు "కుంతాపసూక్తము" అథర్వవేదములో
కలిసియున్నవి."

ఇపుడీ ప్రక్షేపములనబడు వానిగుఱించి యాలోచింతము.

<u>ప్రక్షేపములపై విమర్శనము :</u>

ఋగ్వేదము:- మొదట ఋగ్వేదములో ప్రక్షిప్తములనీ చెప్పబడు పరిశిష్టముల గుఱించి విచారింతుము. శాఖలకాలము, బ్రాహ్మణముల కాలముకన్న చాలాప్రాచీనమైనదని రఘునందన శర్మగారంగీకరించియున్నారు. (వై సం. పు. 541) "శాఖల యారంభకాలమున కనేక వత్సరముల తదుపరి సంహితలలో ఖిలభాగము- ప్రక్షిప్తభాగము- చేర్చబడినది. ఆ "ఖిలభాగముల" వర్ణన బ్రాహ్మణములలో కలదు" (పు. 541)

'వాలఖిల్య సూక్త'మే బ్రాహ్మణగ్రంథమునుండి తీసుకొని ఋగ్వేదములో చేర్చబడినదో శర్మగారు తెలుపలేదు. అటుల తెలుపుటకని కవసరమే. వాలఖిల్య సూత్రములు ప్రక్షిప్తములని వారు రెండు ప్రమాణముల నిచ్చినారు.

1 మొదటిప్రమాణము: నిది ఐతరేయాబ్రాహ్మణమునుండి

గ్రహించినాడు. ఐతరేయబ్రాహ్మణము (28-8)లో నిటులకలదు. “వజ్రేణ వాలాఖిల్యాభిర్వాచః కూటేన।” ఈవాక్యమునకు సాయణాచార్యులు భాష్యమువ్రాయుచు “వాలఖిల్యులను మహర్షులుండిరనియు, ఆఋషులకుజెందిన ఎనిమిది సూక్తములున్నవనియు వానిని ఖిల్యనామక గ్రంథములో వ్రాసిరనియు” తెలిపినారు.
(వాలఖిల్య నామకాః కేచనమహర్షయః తేషాం సంబంధీన్యష్టౌ సూక్తాని విద్యంతే తాని వాలఖిల్య నామకే గ్రంథే సమానామ్యంతే)
(సాయణాచార్యః)

దీనికి సమాధాన మివ్వవలసియున్నది. శర్మగారనుకున్నంత స్పష్టముగా నీ“ఐతరేయ బ్రాహ్మణ”వాక్యములేదు. కొందఱు చివరియధ్యాయములు ప్రక్షిప్తములుగా చూపుదురు. (Encyclopedia Britanica) లో ప్రాచీన సంస్కృతమునకు సంబంధించిన వ్యాసము.)

శర్మగారు చూపినప్రమాణము ఈ ప్రక్షిప్త భాగాంతర్గతమైనదే. అప్రమాణములగు వ్యాసములు మరొకదానిని అప్రమాణమును ఎట్లుపోనగును? దానినెట్లు ప్రమాణముగా స్వీకరించవలెను? సాయణాచార్యులు వాడిన ‘కేచన’ శబ్దమువలన నతనికి ‘వాలఖిల్య’లని చెప్పబడు ఋషుల గుఱించిన పరిచయములేదని స్పష్టముగా తెలుపుచున్నది. ఎట్టిప్రమాణములేకుండగనే ‘వాలఖిల్య’ఋషులగుఱించియు మఱియు ‘వారి వాలఖిల్య’ మనిచెప్పబడు గ్రంథమునుగుఱించియు కల్పన గావించినటుల కనిపించుచున్నది. భారతీయులుమరియు విదేశీయులు వ్రాసిన సంస్కృత సాహిత్యములో నెచ్చటను “వాలఖిల్య” నామక గ్రంథములున్నట్లు కనిపించదు.

2 రెండవ ప్రమాణము వేదో'యనువాకానుక్రమణిక' నుండి చూపినారు. అ దుఖిలభాగమును విడిచి ఋగ్వేదములో 1000 సూక్తములున్నట్లు వ్రాయబడియున్నది.

"సహస్ర మేతత్సూక్తానాం నిశ్చితం ఖైలికై ర్వినా"
(అనువాకానుకమణి)

కాని యీ అనువాకానుక్రమణి పేరుతో శ్రీపండిత భగవద్దత్తగారు 'శాకలశాక'లో 1117 సూక్తములు మఱియు 'వాష్కలశాఖలో' 1127 సూక్తములున్నట్లు వ్రాసినారు.

"ఏతత్ సహస్రం దశసప్త చైవాష్టావతోవాష్కలకేఽధికాని।
తాన్యస్యే శాకలేశై శరీయేవదంతి శిష్టసఖిలేషు విప్రాః 36

వీనివలన రఘునందనశర్మగారు చూపిన వాక్యము ఋగ్వేదమును గుఱించి కాదనియు, వేదో యొక విశేషశాఖను గురించినదనియు. దానిలో వాలఖిల్య సూక్తములేకాకుండా మరొక 14 సూక్తములు 'వాష్కలశాఖ' కన్న తక్కువగా నున్నవనియు, స్పష్టముగా తెలియుచున్నది.

శర్మగారికి కేవలము ఋగ్వేదము యొక్క రెండు శాఖలు మాత్రమే తెలియును అయన తదుపరిగల విద్వాంసులనేక శాఖల నెరిగి యున్నారు. వారు "అశ్వలాయనాది" శాఖల గురించి తమ గ్రంథములో వ్రాసియున్నారు. (పం. భగవద్దత్తగారి వైదికవాఙ్మయేతిహాసము (పే.98-102)

వాలఖిల్యసూక్తములు వాష్కలశాఖలోనున్నవి. శాకల, వా

ష్కాల, శాఖల రెండింటిని వైదికులొకటిగా నొప్పుకొని, యొకే దానిలోనే వ్రాసియున్నారని, శర్మగారంగీకరించుచునే యున్నారు. ఈరెండు శాఖలు నేటివరకొకే దానిలో లభ్యమగుచున్నవి. ఇట్లు లంగీకరించుచునే "వాలఖిల్య సూక్తములు" పరిశిష్టములనియు, మూలముకాదనియు వారెటు లనగలిగిరో యర్థముకాదు

స్వామి హరప్రసాద్- మఱియు వేదములలో ప్రక్షిప్తములు:

స్వామి హరప్రసాద్ యొక్క "వేదసర్వస్వము" నాధారముగా జేసికొనియే రఘునందనశర్మగారు తమగ్రంథములో ప్రక్షేపములు మఱియు పునరుక్తులగుఱించి వ్రాయమొదలిడిరి. (వై. సం పు 551) కాని స్వామి హరప్రసాద్ ఋగ్వేదముతప్ప మిగతావేదముల నపౌరుషేయములుగా నమ్మరని వారు గ్రహించవలసి యుండిరి అట్టివారు చెప్పు ప్రక్షేపములగురించి యాలోచించుట సమంజస మెట్లగును?

"స్వామి హరప్రసాద్" తమగ్రంథమున నొకచోటనిటుల వ్రాసినారు.

యజుర్వేదము:- "యజ్ఞ కర్మలకు సంబంధించిన యజున్నామక మంత్రములన్నిటిని ఋగ్వేదమునుండివేరుచేసి, వానిలో కొన్నింటి నాకాలపు భాషలో వ్రాయబడిన బ్రాహ్మణము లనబడు గద్యభాగములలో యథోచిత స్థానములజేర్చి యజ్ఞ పద్ధతి రూపములో వ్రాసిరి. దీనినే పిమ్మట యజుర్వేదమనినారు"

సామవేదము:- "ఇటులనే యజ్ఞకార్యములందుపాడబడు సామములను మంత్రములు. ఋగ్వేదమునుండి వేరుజేసి విశేష క్రమమున వ్రాయబడినవి దానినే సామవేద మనెదరు."

అథర్వవేదము:- ప్రాచీన సాహిత్యములో పరంపరగా లభ్యమగు మంత్రములలో అధికముగా ఋక్సంహితయందుగలవి మఱియు "ఐతిహ్య శ్లోకములు" మున్నగు ఘృణితములను, వ్యర్థములనగు నవీన గ్రాంథికవాక్యములచే అథర్వవేద సంహిత సిద్ధమొనర్చినారు." (స్వామి హరిప్రసాద్ గారి "స్వాధ్యాయ" మను పుస్తకములో పుట 3-5)

ఇట్టి తుచ్ఛవిచారములుగల వ్యక్తి. వేదములలో ప్రక్షేపము లున్నవన్న లక్ష్యపెట్టదగునా? రఘునందనశర్మగారు అతనివ్రాతల నమ్మవలసిన యవసరములేకుండెను. అటుల నమ్ముటచే వేదములలో ప్రక్షేపములున్నవను భ్రమ వీరికి గలిగినది.

వాలఖిల్య సూక్తములు :

ఋగ్వేదముయొక్క ప్రారంభకాలమునుండియే దానిలో నీ సూక్తములున్నవి పిమ్మట జనించిన శాఖలలో కొన్నిటియందివి యున్నవి మరికొన్నిటిలో లేవు. శాఖలేర్పడినప్పటి నుండియే వానిలో సూక్తములు మఱియు మంత్రముల సంఖ్యలలో భేదము గలిగినది. రఘునందనశర్మగారు. శాకల, వాష్కల శాఖల రెండిటి నాద్యశాఖలనియు, వీని మంత్రముల సంఖ్యలలో న్యూనాధిక్యత లేదనియు సంగీకరించిరి ఋగ్వేదసంహిత యాశాఖలకు భిన్నముగానేయున్నది దానిలో వాలఖిల్య సూక్తము లున్నవి. అందుచే పండిత భగవద్దత్త గారిట్లు వ్రాసినారు.

"శాకల శాఖాగ్రంథములలో వాలఖిల్య సూక్తములుచాలా లేవు. వాష్కల శాఖాగ్రంథములలో నివియున్నవి. మూలఋగ్వే

దసంహితలో నివన్నియు గలవు" (వైదిక వాఙ్మయేతిహాసము- ప్రథమభాగము- పు 76)

"ఈ శాఖలో అష్టమమండలములోని 11 సూక్తములలో గల 80 వాలఖిల్య మంత్రములుకూడా నున్నవి. ఇవి ఋగ్వేదము యొక్క అంగములు." (వై. వా. ఇతి ప్ర భా పు 135)

ఈ వాలఖిల్య సూక్తముల ప్రాచీనతనుగురించి 'వింటర్నిట్జు' గారిట్లు వ్రాసిరాస.

"ఖిల శబ్దమునకర్థము పరిశిష్టము. ఇది మూలమేయనియు, నేకత్రితముగా ఎంచి సంహితలలో తదుపరి చేర్చినారనియు నీ నామమే తెలుపుచున్నది. ఈ ఖిలమంత్రములలో కొన్నింటి ప్రాచీనత ఋగ్వేదములోని యితర ఋక్కులకంటె తక్కువకాదని తలంచబడుచున్నది. వీనినిపరిశిష్టములని యేలజెప్పినారో తెలియదు. (A Hi tory of Hum n li erature, by Winternitz. P 59 60)

"ఈవాలఖిల్య సూత్రములు హస్తలిఖిత ప్రతులన్నింటిలో నున్నవి" (A Hi tory of H man literature P 60)

ఈ విషయాముల నాలోచించిన పిమ్మట, వాలఖిల్యసూక్తములు ప్రక్షిప్తములును గావనియును, పరిశిష్టములు గావనియును, నవి వేదము యొక్క అంగములేననియు మాయభిప్రాయము. ఈ సూక్తములారంభమున మిక్కిలి ప్రచారములో నుండెడివని తెలియుచున్నది బహుశః వాలఖిల్యమను వ్యక్తి వీనిని ప్రచారము చేసియుండును. అందుచే నతనిపేరుతో నివి ప్రసిద్ధికెక్కి యుండును. సులభముగా వీనిని గుర్తించుట కొరకీమంత్రముల మొదట 'అథ'

యనియు చివర "ఇతి" యనియు నెవరోచేర్చినారు. పిమ్మటని 'అథ' మరియు 'ఇతి' అనుశబ్దములు పుస్తకమున కంగముగానేర్పడినవి ఈ సూత్రములు చివర యుండుటకు బదులుగా మూలములో చేర్చ బడినవనుశంక రఘునందన శర్మగారికి కల్గినది ఇదిసరిఅయినది కాదు ఈ సూక్తములు "అష్టమమండలము"లో మధ్యభాగములో నున్నవి "గిపిథ్" తాను గావించిన ఋగ్వేదానువాదములో వీనిని అష్టమ మండలమునుండితొలగించి, చివరలోచేర్చి గొప్పకృతఘ్ను డైనాడు యూరోప్‌లో 'మాక్సుముల్లర్'చే గావింపబడిన శుద్ధఋ గ్వేద సంస్కరణలోగూడ నీసూక్తములున్నవి.

యజుర్వేదము:- యజుర్వేదములోను ప్రక్షిప్తము లున్నవని రఘునందనశర్మగారు ప్రమాణములు జూపినారు. వానిలో నొక్కొక్కదానిని గురించి యాలోచింతము.

1 మొదటి ఆక్షేపణ :- సర్వానుక్రమణిలో నిటులకలదు. "ఋక్, ఖిల, శుక్రియ మంత్రములతో పాటు మాధ్యందినీయ యజుర్వేదముయొక్క ఋషి, దేవతా, ఛందస్సుల యనుక్రమణిని గావించుచున్నాను. (మాధ్యందినీయే వాజసనేయకే యజుర్వేదామ్నాయే సర్వే సఖిలే స శుక్రియే। ఋషి దైవత ఛందాంస్యానుక్రమిష్యామః॥ (సర్వానుక్రమణి) ఇందు ఖిలభాగమున్నట్లు ప్రత్యక్షముగా తెలుపబడినవని రఘునందనశర్మగారి యభిప్రాయము

సమాధానము :- పరిశిష్టమును 'ఖిల'మందురు. కాని ప్రక్షిప్తమునుకాదు. ఏగ్రంథములోని పరిశిష్టమునైనా, నాగ్రంథ కర్త యొక్క రచనయే యని యంగీకరింతుము దానిని గ్రంథేతర

భాగముగా నేలదలంచవలెను. మాధ్యందినీయశాఖ మూల యజుర్వేదముగాదని యంగీకరించవలెను. ఈశాఖలోని మంత్రముల సంఖ్య మూలయజుర్వేదమున కనుకూలముగానే యున్నవనియు, న్యూనాధిక్యత గావించబడలేదనియు చెప్పవచ్చును వ్యాసుని శిష్యుడు వైశంపాయనుడు. అతడు తైత్తిరీయశాఖయనబడు కృష్ణ యజుర్వేదమును ప్రచారమొనర్చినాడు అతని శిష్యుడే యాజ్ఞవల్క్యుడు. ఈయన శతపథ బ్రాహ్మణరచయిత. ఇతనికిని జనకునకు జరిగిన సంవాదము బృహదారణ్యకోపనిషత్తులో గలదు. ఇతనినే వాజసనేయ యాజ్ఞవల్క్యుడనియు నందురు. ఇతనికిని వైశంపాయనునకునువిరోధమేర్పడినది అందుచే నీయాజ్ఞవల్క్యుడు తైత్తరీయశాఖ (కృష్ణయజుర్వేదము) యొక్క ప్రచారమునకు విరోధిగానుండెను. అతనికి 15గురు శిష్యులుండిరి. వారిలో నొక్కొక్కరు యజుర్వేదముయొక్క యొక్కొకశాఖను ప్రచారము గావించినారు. వీరిలో 'కణ్వుడు' మఱియు 'మధ్యందిను'డను నిరువురు శిష్యులుండిరి. వారే 'కాణ్వ' మఱియు 'మాధ్యందిన' శాఖల ప్రచారమొనర్చిరి. యాజ్ఞవల్క్యుని శిష్యులు సాధ్యమైనంతవఱకు మూలవేదము ననుసరించి నడచెడివారు కృష్ణయజుర్వేదములోవలె, 1975 మంత్రములను 18000 వఱకు పెంచుటకు విముఖులుగానుండిరి ఈకారణముచే వైశంపాయనునకు, యాజ్ఞవల్క్యునకు విరోధమేర్పడినది మహాభారత కాలమునకు పిమ్మట రమారమి అయిదువేల సంవత్సరములక్రిందట నీ కాణ్వ, మాధ్యందినశాఖలుత్పన్నమైనవి. కాని మూలయజుర్వేదమింతకంటె నతి ప్రాచీనమైనదని గుర్తించవలెను. వాల్మీకి రామాయణములో శ్రీ శ్రీరాముడు హనుమంతుని యోగ్యతను గుఱించి లక్ష్మణునితో నిటుల చెప్పియున్నాడు.

"నా ఋగ్వేదవినీతస్య నా యజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుం॥"
(వాల్మీకి రా 1-3-29)

ఈ వాక్యములవలన రామాయణ కాలమునకు పూర్వమే చతుర్వేదములున్నట్లు నిర్ధారణయగును.

శాఖలేర్పడిన పిమ్మట చాలాకాలమునకు బ్రాహ్మణగ్రంథములు వ్రాయబడినవి. అందువలన శాఖ లేర్పడుటకు పూర్వమే యున్న వేదములలో బ్రాహ్మణగ్రంథములభాగములు చేర్చుట నంగీకరించుటకు వీలుకానిది.

యజుర్వేద విషయములు :- యజుర్వేదవిషయముల నెఱిగినపిమ్మట రఘునందనశర్మగారు చెప్పు కల్పిత 'ఖిల' భాగముల స్పష్టీకరణ జరుగును

| సంఖ్య | అధ్యాయములు | విషయము |
|---|---|---|
| 1) | 1,2 | దర్శపౌర్ణిమా యజ్ఞము |
| 2) | 3 | దైనిక, చాతుర్మాస్య యజ్ఞములు |
| 3) | 4 నుండి 8 వరకు | సోమ యజ్ఞము |
| 4) | 9, 10 | వాజపేయ, రాజసూయ యజ్ఞాంగ మంత్రసమూహము |
| 5) | 11నుండి 18వరకు | వేదిక నిర్మాణాదులు |
| 6) | 19నుండి 21వరకు | సౌత్రామణి యజ్ఞము |

7) 22నుండి 25వరకు అశ్వమేధ యజ్ఞము
8) 26నుండి 29వరకు ప్రారంభిక యజ్ఞ సంబంధ నియమములు
9) 30నుండి 39వరకు పురుషమేధము, పితృమేధము సర్వమేధము మఱియు ప్రవర్గ్య నియమవిధులు
10) 40 బ్రహ్మవిద్య(జ్ఞానకాండము)

మహీధర, ఉవ్వటులు యజుర్వేదముయొక్క టీకల వ్రాయుచు, నేదోయొక యజ్ఞవిధానముగల మొదటి 25 అధ్యాయములు మూలమనియు, యజ్ఞేతర విషయములుగల యితర యధ్యాయములు 'ఖిల'మనియును, మొదటి 25 యధ్యాయముల వివరములనియును వ్రాసినారు. ఈవ్రాతలవలన నీయధ్యాయములు ప్రక్షిప్తములని తలంచబడజాలవు.

2 రెండవ ఆక్షేపణ :- సర్వానుక్రమణిలో నిటులగలదు.

1 "యజుర్వేదము(19-12)లోని"దేవా యజ్ఞమతన్వత"యను మంత్రమునుండి 20 అనుష్టుప్ ఛందస్సులు బ్రాహ్మణభాగములు"

2 "24వ. యధ్యాయము మఱియు 25వ, అధ్యాయములో నారంభములోగల "వాద"నుండి 9 మంత్రములు బ్రాహ్మణములు"

3 యజుర్వేదము 30వ, అధ్యాయములో "బ్రాహ్మణే బ్రాహ్మణమ్"నుండి పూర్తి యధ్యాయము బ్రాహ్మణము.

సమాధానము :- మొదటి యాక్షేపణయొక్క సమాధా

నములో యజుర్వేదముయొక్క మొదటి 25 యధ్యాయములవరకు మూలమేయని, ఖిలమని చెప్పుటకెవ్వరును సాహసించలేదనియు స్పష్టము గావించబడినది. ఇక సర్వానుక్రమణికారుడెటుల వానిని వేదేతరభాగములని చెప్పగలడు? సర్వానుక్రమణికారుని భావము నర్థము జేసికొనుటలో యూరోపు విద్వాంసులకు, భ్రమకలుగుచునే యుండును. కాని శర్మగారుకూడా యీభ్రమలో పడిపోవుట యాశ్చర్యకరముగానున్నది.

మొదటిదానికి సమాధానమిది:-

పై మంత్రములు బ్రాహ్మణగ్రంథ భాగములేయైనచో నవి యే బ్రాహ్మణగ్రంథములోనివి? బ్రాహ్మణగ్రంథములు ఛందస్సులోలేవు. అటులైన ఛందస్సులు బ్రాహ్మణభాగ మెట్లగును? ఈ ఛందస్సులకుగల దేవత ప్రజాపతి మఱియు ఋషులు గౌతముడు మొదలగువారు. ఈఋషులు, బ్రాహ్మణ గ్రంథకారు లందఱకన్న ననేకవర్షములకు పూర్వమున్నవారు.

వాస్తవవిషయమిది. బ్రాహ్మణములలో కర్మకాండకు ప్రధానతగలదు. బ్రాహ్మణగ్రంథముల రచనకంటె పూర్వమే బ్రాహ్మణశబ్దము కర్మకాండకొఱకై ప్రయోగింపబడెడిది. అందుచే శతపథాది కర్మకాండకు సంబంధించిన గ్రంథములురచింపబడినపుడు, వానికర్తలు కర్మకాండమను యర్థమున రూఢిగాంచిన బ్రాహ్మణ శబ్దమునే యాగ్రంథములపేర్లకు తగినవిగాభావించి, వానికి "బ్రాహ్మణము"లని పేరుబెట్టిరి. ఈ ఆచారము ననుసరించియే, సర్వానుక్రమణికారుడును, కర్మకాండమను నర్థమున బ్రాహ్మణశబ్దమును బ్రయోగించినాడు. అందుచే పైనచెప్పిన మంత్రములు

కర్మకాండ విభాగమునకు జెందినదని యాతని యభిప్రాయమై యుండును. వీనిలో ప్రక్షేపాది విషయముల వెదుకుట నిరర్థకమే.

3 మూడవ ఆక్షేపణ :- రఘునందన శర్మగారొక శ్లోకమును ప్రకటించినారు. అదెందులోనిదో తెలుపలేదు. దాని ప్రకారముగా యజుర్వేదములో 1900 మంత్రములే యున్నవి. కాని వర్తమాన యజుర్వేదములో 1975 మంత్రములున్నవి అందుచేనీయధిక సంఖ్యగల మంత్రములెచటివో దీనిలో జేర్చినారని వారివాదము

సమాధానము :- పండిత భగవద్దత్తగారు, కాశీలోని శిక్షాసంగ్రహములో ముద్రింపబడిన, వాసిష్ఠి శిక్షననుసరించి యజుర్వేద మంత్రముసంఖ్య 1975 యని వ్రాసినారు. (వై. వాఙ్మయ చరిత్ర పుట 170-172) అధ్యాయములవారీగా మంత్రములసంఖ్య నొసంగబడినది. అందుచే యజుర్వేదములో 1900 మంత్రములే యున్నవనుట పొరబాటు శర్మగారు చూపిన శ్లోకములో నెవరో కొంచెము చమత్కారము గావించినారు. పండిత భగవద్దత్తగారు వాయుపురాణములోని, 61వ, అధ్యాయములోగల 67, 68 శ్లోకముల రెంటిని జూపినారు. వానిలో నిటులున్నది.

"ద్వే సహస్రే శతే న్యూనేమంత్రే వాజసనేయకే ఋగ్గణః
పరిసంఖ్యాతో బ్రాహ్మణం తు చతుర్గుణమ్॥"

అష్టౌ సహస్రాణి శతాని చాష్టాశీతి రన్యాన్యధికశ్చ పాదః।
ఏతత్ ప్రమాణం యజుషాం ఋచాంచ స శుక్రియం సఖిలం
యాజ్ఞవల్క్యం॥

బ్రహ్మాండ పురాణములోనిపూర్వభాగమున 35వ, అధ్యాయములోని 76, 77 వ, శ్లోకములును పైవలెనేయున్నవి. యాజ్ఞ

వల్క్యానికి సంబంధించిన సమస్త శాఖలలోని ఋక్కులు మఱియు యాజుష మంత్రపాదల సంఖ్య 8880 మఱియు నొకపాదమని పై రెండవశ్లోకములలోగలదు. మొదటశ్లోకములో ఋక్కుల(పాదవ్య వస్త గలపి) సంఖ్య 1900 లని తెలుపబడినది. దీని యభిప్రాయా నుసారమాతనికి సంబంధించిన యాజుష మంత్రములు 6980 మ ఱియు నొకపాదమని తెలియుచున్నది. శ్లోకములో ఋగ్గణః పరి సంఖ్యాతో" యను పాఠమున ఋక్కులు 1900 లను నిర్ణయము న్నది యజుర్వేద మంత్రములు 1900 లని దీని యర్థముకాదు. రఘునందనశర్మగారు జూపిన శ్లోకము పై మొదటి శ్లోకమునకు వి కృతరూపము దానిలో 'ఋగ్గణః' యనుచోట "ఇత్యుక్త" యనుశ బ్దము నెవరో చేర్చినారు. అందుచే నీయభిప్రాయ మాతనికిగల్గెను. చరణవ్యూహములో నిదేశ్లోకమున్నది "ద్వేసహస్రే శతేన్యూనేమం త్రే వాజసనేయకే। ఋగ్గణః పరిసంఖ్యాతతస్తోన్యాని యజూషిచ

ఇందుకు కూడా "ఋగ్గణః" యనుశబ్దమున్నది అందుచే శర్మగారు చూపినశ్లోకముచే ప్రక్షేపవిషయము సమర్థింపబడజాలదు

ఇటనొకవిషయము నెఱుగదగును. వాజసనేయములనబడు 15 శాఖలలోను మంత్రభేదములున్నవి. కాణ్వశాఖలో 2086 మం త్రములున్నవి. వాజసనేయశాఖలలో మాధ్యందినీయ శాఖయేసమ స్త భారతదేశములో వ్యాప్తిగాంచినది. మాధ్యందిన శాఖాకారుడు మూలసంహితామంత్రముల సంఖ్యలోమార్పుగావించక 1975 మం త్రములనే తన శాఖలోనుంచుటచే దీనికింత వ్యాప్తిగలిగినదని గ్రహించవలెను అందుచేననేక ముద్రణాలయములలో నేడును, మూల యజుర్వేదమును మాధ్యందినీయశాఖయనియే ప్రచురించుచున్నారు.

4 నాల్గవ ఆక్షేపణ:- ప్రసిద్ధ యజుర్వేదమంత్రము "నతస్య ప్రతిమాఅస్తియస్యనామ మహద్యశః" (యజు 22-3) యొక్క రెండవచరణములో ప్రక్షేపమున్నదని శర్మగారిటుల వ్రాసినారు. ఈ మంత్రములో మొదటి సగభాగము మంత్రముదే. కాని రెండవ సగభాగములో విభిన్నస్థలములందలి మంత్రముల ప్రతీకములున్నవి. ఈ ప్రతీకలున్న భాగమే ప్రక్షిప్తము.

సమాధానము:- ప్రతీకలను జూపువాక్యము ప్రక్షిప్తవాక్యమని యెట్లు చెప్పనగును. ఒక గ్రంథరచయిత తన గ్రంథములో నొకయుత్తర భాగమున పూర్వభాగములోనియుదాహరణల నివ్వజాలడా? ఒకకార్యమునుగురించి చెప్పవలసినపుడా గ్రంథములోని పూర్వభాగములోనున్న మంత్రముల, నావశ్యకతగలిగినప్పుడు, ప్రతీకల జూపుట సరిపోవునని తలంచబడును. మరల నామంత్రముల పునర్లేఖనమవసరమైయుండదు. ఈ మంత్రములోగూడా నదేవిషయము గావించబడినది. ఈ మంత్రములో మొదటిది యజుర్వేదము యొక్క 22, అధ్యాయములోనున్న 8వ మంత్రము, రెండవది 12వ, అధ్యాయములోనిది మూడవదగు "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" యనుమంత్రము 13వ. అధ్యాయములోనున్నది "హిరణ్యగర్భఃఇతి" యనుప్రతీకయజుర్వేదము (13-4) లోనిదవి తెలుపక ఋగ్వేదము (8-7-6)లోనిదని శర్మగారు తెలిపినారు. అందుచే నీ మంత్రముగాదని, ఋగ్వేదములోనిదను భావనగలుగును. ఇటులెందుకుజేసినారో తెలియుటలేదు. దీనితో యజుర్వేదములో, ప్రక్షిప్తములున్నవని చెప్పు పరిమితములగు, యాక్షేపణలంతమైనవి.

సామవేదము:-

మొదటి ఆక్షేపణ:- సామవేదములోని "మహానామ్ని" ఋక్కులు

మఱియు నారణ్యకభాగము పరిశిష్టములు మహానామ్ని ఋక్కులు పరిశిష్టములనుటకు ప్రమాణముగా శర్మగారు ఐతరేయబ్రాహ్మణ్యములోని యొక వాక్యమునుజూపినారు.

"తాఊర్ధ్వా సామ్నోऽభ్య సృజత। యదూర్ధ్వాసీక్నోऽభ్య సృజత, తతసిమాఅభవన్ తత్సిమానాసి మాత్వమ్"

(ఐత॰ బ్రా. 22-2)

దీనిభావమిది. ఈ"మహానామ్ని ఋక్కులనుపజాపతి వేదసీమకు వెలుపల గావించినాడు" ఇచట మహానామ్ని ఋక్కులు, ఋగ్వేదసీమకు వెలుపలివని తెలుపబడినది.

సమాధానము:- ఐతరేయబ్రాహ్మణములో నీఋక్కులు పరిశిష్టములనిలేదు. ఈవాక్యములో వీనిని ప్రజాపతి(ఈశ్వరుడు) రచించినాడని కలదు ఇకనివిచేర్చబడినవను ప్రశ్న యెట్లుగలుగును.? ఈవాక్యము నకర్థమును మరొకవిధముగా శర్మగారు గ్రహించినారు. ఈ ఋక్కులు ఋగ్వేద సీమలోనివి కావని వారి యభిప్రాయము. ఇవి సామవేదములేయైన నవి ఋగ్వేదములో నివికాకుండుట స్పష్టమే వేద సర్వసమునకు కర్త యగు హరప్రసాద్ వ్రాతల నాధారముగా జేసికొనియే యీ యాక్షేపణలు బయలుదేఱినవి. కాని యా హర ప్రసాద్‌గారే 75 మంత్రములుగల సామవేదము నొకదానినచ్చు వేయించినారు. అందుండి ఋగ్వేద మంత్రములనన్నింటిని తొలగించి, సామవేద మూలమంత్రములు కేవలం '75' యని ప్రకటించినారు ఆ మంత్రములలోను నివి సామవేదము యొక్క ఋక్కులనియే యాతడు ముద్రించినాడు. అందుచే నివి పరిశిష్టములని శర్మగారు జూపుహేతువు నరియైనదికాదు.

ఇక ఆరణ్యకభాగమును గురించి శర్మగారిటుల వ్రాసినారు "ఇదియును పరిశిష్టమే' పూర్వార్చికలో నారవఖండమున, నారణ్యకభాగము కలుప బడియున్నది. దానిలో రెండింటికిబదులుగా మూడు విభాగములు ముద్రింపబడియున్నవి. ఈ మూడవ విభాగమే యారణ్యకము. సాయణాచార్యులు కూడా దీనిని పరిశిష్టమనినారు. మఱియుదాసిని గాంచినచో పరిశిష్టమనియే తోచును.

(వై. సం. పు 553)

సమాధానము:- ఆరవ ప్రపాఠకములోని మూడవభాగము (ఆరణ్యకము) ను మేము ధ్యానపూర్వకముగా చూచినాము. ఆ యారణ్యకములో మొత్తం 55 మంత్రములున్నవి. వానిలో 42 మంత్రములు ఋగ్వేదములోనివే వీనిలోని 11 మంత్రములు సామవేదములోని ఉత్తరార్చికాదులలో వచ్చినట్టివికలవు. వీనిని పరిశిష్టములనుట పొసగదు సంపూర్ణారణ్యక మంత్రముల బరిశిష్టములనుట, నిరర్థకమైనదే సామవేదములో 75 మంత్రములుతప్ప మిగిలినవన్ని ఋగ్వేదములోవే వానిని పరిశిష్టములను సాహసమెవరికున్నది.

## అథర్వవేదము:-

మొదటి ఆక్షేపణ:- అథర్వవేదములోని "కృతాంతసూత్రము" కూడా 'ఖిల' నామమున పసిద్ధము. ఈ సూత్రమున కాద్యంతము లందు 'ఆధేత్యా' దులుండుటయే దీనికికారణము. స్వామి హరిప్రసాద్ దీనిని 'వాలఖిల్య' సూక్తములవలె పరిశిష్టములనుట రెండవ కారణము.

సమాధానము:- అథర్వవేదములోని 20వ కాండముయొక్క సూక్తములలో 127 నుండి 136 వరకుండునవి కృతాంత సూక్తములని

బడును. ఇవి పరిశిష్టములనుటకొసంగిన హేతువులు సరియైనవికావు. ఋగ్వేదములోని "వాలఖిల్య" సూక్తములు మూలవేదములోనివని ఋజువుచేసిన హేతువులే విట గమనించతగినవి ఈ సూక్తములు అధర్వవేద మూలాంశములుగానే మేమంగీకరింతుము.

ద్వితీయాక్షేపణ:- అధర్వవేద 19 వకాండలోని 22, 23 వ సూక్తములలో నిటులగలదు.

"అంగిరసానామా ద్యైవంచాను వాకై స్వాహా
అథర్వణానాం చతుఋచేభ్యః స్వాహా"

"ఈ వాక్యము లెక్కడివో? ఇట్టివి ప్రక్షిప్తములని స్వయముగా తెలుపుచున్న" వని శర్మగారు పే 554 లో వ్రాసినారు.

సమాధానము:- యజుర్వేద సంబంధ చతుర్థాక్షేపణకు సమాధానముగా నొసంగిన హేతువులే యీసూక్తములుగూడ ప్రక్షిప్తములుగావనియు మూల వేదభాగమేయనియు, ఋజువుచేయును. ఈ వాకములు "అథర్వవేదము"లో నింతకు పూర్వము కూడా వచ్చియున్నవి. వేదములో పూర్వమున్నమంత్రములతో తదుపరి చెప్పిన విధులయందాహుతులొసంగునపుడు ప్రయోగింప వలదను, నియమమెచ్చటను లేదు.

## ఉప సంహారము

పండిత రఘునందనశర్మగారు స్వామిహరప్రసాద్ వ్రాతల నింతగా విశ్వసించవలసిన యవసరములేకుండెను తత్కారణమున వారి ప్రశంసనీయముగు "వేదసంపత్తి గ్రంథము'' నిర్హేతుకములగు యాక్షేపణలతో కళంకితమైనది. ఆక్షేపణలు మహత్వ పూర్ణములుగావని పాఠకులు గ్రహించగలరు. వీనితోవేదములలో ప్రక్షేపములున్నవను ప్రశ్న వ్యర్థముగా రేకెత్తించబడినది. వేదముల

రక్షించుటకు పైన చెలిపిన రక్షణ లెన్నియో గావించ బడినప్పటికి వానిలో ప్రక్షిప్తములున్నవని తలంచబూనుట సమాలోచనా రహితత్వమే యగును.

## ఉపవేదములు

ఋగ్వేదాది చతుర్వేదములపౌరుషేయములగుటచే స్వతః ప్రమాణములు. ఇతరగ్రంథములన్నియు వేదానుకూలమగుట పరతః ప్రమాణములు.

వైదిక సాహిత్య వివరణమిట్లుగలదు.

నాలుగు ఉపవేదములు:-

1 ఆయుర్వేదము:- వైద్యశాస్త్రమగు "సుశ్రుతమగు" ధన్వంతరికృతములగు నిఘంటువు, మఱియు "చరకము" మొదలగునవి కలసి ఆయుర్వేదమనబడును, ఇది ఋగ్వేదముయొక్క 'ఉపవేదము' అథర్వవేదములో కూడ "వైద్యశాస్త్రము" యొక్క విషయము లధికముగా వర్ణింపబడి యుండుటకూడా నిట్లు జ్ఞప్తియందుంచ కొనదగును.

2 ధనుర్వేదము:- దీనిలో శస్త్రాస్త్ర నిర్మాణ ప్రయోగ విధులున్నవి. అంగిర భరద్వాజాదికృత సంహితలీ విద్యకు ప్రాచీన గ్రంధములు భోజకృతమగు "సమరాంగణ సూత్రధారము" కూడ ఏతద్విద్యా విషయకమగు సమూల్యగ్రంధము.

3 గాంధర్వ వేదము:- నారద సంహితాదులీ యుపవేదమునకు జెందిన గ్రంథములు. సామగానముతో నీయుపవేదమున కెక్కువ సంబంధముకలదు.

4 అర్థవేదము:- విశ్వకర్మ, త్వష్ట, దేవజ్ఞుడు, మరియు మయుడు మొదలగువారిచే రచింపబడిన శిల్పశాస్త్ర సంబంధ సంహితలీ యుపవేదమునకు ప్రాచీనగ్రంథములు కౌటిల్యార్థ శాస్త్రముకూడ నీవిషయమున నొకయమూల్యగ్రంథము.

షడంగములు:-

1 శిక్ష:- వర్ణ, స్వర, మాత్ర, బల సామ, సంతాన, భేదములతో, వర్ణోచ్చారణనుగురించి విధిప్రకారముగా దెలియజేయు శాస్త్రము శిక్ష యనబడును పాచీన గ్రంథములేకాక ఋషి దయానంద కృతమగు వర్ణోచ్చారణ శిక్షయు నీవిషయమున నుపయుక్తమగు గ్రంథము.

2 కల్పము:- వేదమంత్రములను, యాజ్ఞికకర్మకాండలో వినియోగపడుచు విధుల తెలియ జేయుట యీశాస్త్రము యొక్క కార్యము. అశ్వలాయనాది కల్పసూత్రములు ప్రత్యేకి వేదమునకు వేరువేరుగా నున్నవి.

3 వ్యాకరణము:- వ్యాకరణముయొక్క సంక్షిప్త వివరణ మీ యధ్యాయములోను ఇతఃపూర్వ సంస్కృతభాషా ప్రసంగములో నొసంగబడినది.

4 నిరుక్తము:- నేడుకేవలము యాస్కాచార్యుని "నిరుక్తము" మరియు "నిఘంటువు" లభ్యమగుచున్నవి. ఈ నిరుక్తమున మూడు భాగములున్నవి. (1) నైఘంటికభాగము:- దీనిలో వైదిక శబ్దములకు పర్యాయపదములున్నవి 2:- నైగమవ్యాఖ్య:- వేద మంత్రములు మరియు శబ్దముల వ్యాఖ్యాన మిందు గలదు.

3:-దైవతవాఖ్య:- అగ్ని వాయు. సూర్యాదిదేవతలవాఖ్య దీనిలో నున్నది,

5 ఛందస్సు:- ఈ శాస్త్రమున వైదిక ఛందస్సుగలదు. గాయిత్రి ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్ జగతీ, విరాట్, అతిజగతీ, శక్వరీ, అతిశక్వరీ, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి ఏకపదా. ద్విపదా, ప్రగాథపదిత, ప్రగాథకకుభ, మరియు, మహా పదతి యను 20 ప్రసిద్ధఛందస్సులున్నవి.

6 జ్యోతిషము:- సూర్యచంద్ర నక్షత్రాదుల గతివిధుల తెలియ జేయు శాస్త్రము జ్యోతిషమనబడును సూర్యసిద్ధాంతాది గ్రంధము లీవిషయమున నుపయుక్తములైనవి.

## షడుపాంగములు:-

1 న్యాయదర్శనము:- ఇది తర్క ప్రధానమగు దర్శనము. ఈ దర్శనము సంపూర్ణముగా తర్కము నాశ్రయించియున్నది "కోల్ బ్రుక్" మఱియు "బోట్లింగ్" యనువిద్వాంసులు ప్రకటించి యున్నారు. అరిస్టాటిల్ సంప్రదాయమునకు చెందిననియమములు దీనితో కలియును. న్యాయదర్శనకారుడు ప్రబలతార్కికుడైనను వేదము మిక్కిలి సమ్మానించినాడు. అతడిట్లుతెలిపినాడు.

"మంత్రాయుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ మాప్త ప్రామాణ్యాత్"  న్యాయ-2-1-67

"ఆయుర్వేద మంత్రఫలాదులవలె వేదము ఆప్త ప్రమాణమగుటచే విశ్వసనీయము మఱియు మాననీయము.

## వేదములపైగల త్రివిధారోపణలు

న్యాయదర్శనకారుడు వేదముల ప్రామాణ్య మంగీకరించుటయేకాక వేదములపై నారోపించిన త్రివిధదోషముల పరిహరించినాడు. వేదములపై మోపబడు దోషములను న్యాయదర్శనకారుని సమాధానములతో క్రిందనుల్లేఖింపబడుచున్నది.

1 ప్రథమదోషము (మిథ్యాత్వము):- వేదములలో దెలుపబడిన కర్మలఫలితములు కర్మలొనర్చువారికి లభించవు. అందుచే వేదములు సత్యగ్రంథములు గావు.

న్యాయదర్శనకారుని సమాధానము:- "నకర్మకర్తృసాధన వైగుణ్యాత్" (న్యాయ 2-1-57)కర్మలొనర్చువారిలోగల క్రియాసాధనాది దోషములే వేదోక్త ఫలితము లభించకుండుటకు కారణములు. ఈదోషములులేనిచో తప్పక ఫలితము లభ్యమగును.

దీనిచే వేదముల యసత్యత ప్రకటముకాజాలదు.

2 ద్వితీయ దోషము (వ్యాఘాతము):- విభిన్న సమయములందు పరస్పరవిరుద్ధ విషయములజెప్పుట వ్యాఘాతదోషమనబడదు. అందుచే వేదములలో వ్యాఘాత దోషములేదు. న్యాయదర్శన కారుని సమాధాన మీ తీరుగాగలదు:- "అభ్యుపేత్య కాలభేదే దోష వచనాత్"  (న్యాయ. 2-1-58)

(అంగీకరించియు, కాలభేదమున చూపినదోషమని చెప్పబడినది.)

ఆయాకాలములందు చేయవలెనని తెలుపబడినకార్యముల నాయా సమయములందు జేయుటుచితము. అటులగాక సమయభేదము పాటించనిచో వ్యాఘాతదోషమగును. బ్రహ్మచర్యాశ్రమమున బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమమున గృహస్థ విధులు వేదములో విధించబడినవి. ఈ ద్వివిధములగు విధుల నాయానియత కాలములందు గావించినవి విరుద్ధములుగాదోచవు. కాని, బ్రహ్మచర్యాశ్రమమున గృహస్థ విధులు, గృహస్థాశ్రమమున బ్రహ్మచర్య విధులు నిర్వర్తించిన దోషములగును. ఇది వేదములో వ్యాఘాతదోషమున్నదనుటకు సాక్ష్యముకాజాలదు. కర్త నియమితసమయములందు నిర్ణీత కర్మల నొనర్పక పోవుటచే నీదోషమేర్పడును.

3 తృతీయ దోషము (పునరుక్తి):- అభ్యాస కాలమున, కర్త దేనిని పునరుక్త దోషమనునో యది యతనిదోషమే. వేదదోషము కాదు. న్యాయకారుడిటుల తెలిపినాడు.

"అనువాదోపపత్తేశ్చ" (న్యాయ. 2-1-59)

సార్థకమగు నభ్యాసము "అనువాద"మనియు, నిరర్థకాభ్యాసము 'పునరుక్త' మనియుజెప్పబడును. మూడుసార్లు గాయత్రిని జపించుట, లేక, ఋక్కును రెండుసార్లు చెప్పుట యనువాదమనబడును అది పునరుక్తమన బడదు. విధి వాక్యము, అర్థవాద వాక్యము మఱియు అనువాదవాక్యములని శాస్త్రీయ వాక్యములుండును. వీనిని పునరుక్తులనరు. దర్శనకారుడు వీని లక్షణముల నిట్లు తెలిపినాడు.

"విధిర్విధాయక:" (న్యాయ. 2-1-62)

విధాయకమగు వాక్యము విధి వాక్యమనబడును. ఉదా:-

"స్వర్గమునుగోరువారు అగ్నిహోత్రమును జేయవలెను"

"స్తుతిర్నిందా పరాకృతి: పురాకల్ప ఇత్యర్థవాద:"

(న్యాయ. 2-1-63)

"స్తుతి, నింద, పరకృతి మరియు పురాకల్పమని యర్థవాదము నాలుగు విధములు. 1 విధివాక్యమును ప్రశంసించుట స్తుతియన బడును. స్తుతిచే ప్రవృత్తి గలుగును. (పురుషార్థమొనర్చి దేవతల సురుల జయించిరి. మొదలగునవి) 2 అనిష్టఫలము నిందయన బడును. 3 మానవకర్మలలో పరస్పర వైరుధ్యమును జూపు వాక్యములను పరకృతియందురు. 4 ఇతిహాసయుక్తమగు విధిని పురాకృతమందురు. (జనకుడు సంసారములో నలిప్తుడగుటచే మహాయశస్వి అయ్యెను మనము అట్లేకావలయును)

"విధి విహితస్యాను వచనమనువాద:" (న్యాయ. 2-1-64)

విధి విహితమగు "అనువచనము" అనువాద మనబడును. మొదటిది 'శబ్దానువాద'మనియు రెండవది 'యర్థానువాద' మనియు జెప్పబడును. ఉదా:- సంధ్యచేయుము" ఇది విధివాక్యము. దీనితో శారీరక, సామాజిక,ఆత్మికోన్నతి గలుగును" ఇదిఅర్థవాద మన బడును. "అందుచే సంధ్యన వశ్యమొనర్పుము, సంధ్యన వశ్యమొనర్పుము" ఇదియనువాద మనబడును. దీనిని పునరుక్తి యనరు లిటుల జెప్పినచో నది యనెడి వారి దోషమేయగును. కాని యది వేదముదికాదు న్యాయదర్శన మిటుల వేదమును సమర్థించి, దాని విరోషత్వమును నిర్ణయించినది.

2 వైశేషిక దర్శనము:- ఈదర్శనము, సామాన్య, విశేష పదార్థముల గురించి చర్చించుచున్నది వేదములు స్వత:ప్రమాణములని యీదర్శనకారుడు తలంచి, తన సిద్ధాంతముల బలపఱచుట కు వేదాశ్రయమును బొందినాడు. దర్శనముయొక్క యారంభము లోనే "తద్వచనాదామ్నా యస్య ప్రామాణ్యం" (1-1-3) ఈశ్వరవచన మగుటచే వేదము ప్రమాణమని తెలిపినాడు. వేదములోని వాక్యరచన, బుద్ధిపూర్వకమని మరొకచోట వ్రాసినాడు.

"బుద్ధిపూర్వావాక్య కృతిర్వేదే" (6-1-1)

ఇవేకాక ననేకసూత్రములు వేదముల నంతిమ ప్రమాణ ములుగా గ్రహించుటకు తెలుపబడినవి.

1. 'తస్మాన్నాగమికం' (2-1-17)
"అందుచే శబ్దప్రమాణము సిద్ధించును"

2. 'తస్మాదాగమిక' (3-2-8)
"ఈకారణమున వేద మంగీకరింపబడును"

3. "వేద లింగాశ్చ" (4-2-12)
వేద ప్రమాణమువలన కూడా (అయోనిజయోని నిరూపితమగును)

4. "వేదికంచ" (5-2-10)
(అగ్నియోషధుల గర్భమని)వేదము కూడా సిద్ధాంత మొనర్చుచున్నదు.

5. 'శాస్త్రసామర్థ్యాచ్చ' (3-2-21)
(ఆత్మలనేకములవి) శాస్త్రము సమర్థించుటచే"

4 యోగ దర్శనము:- యోగదర్శనములో "తత్రనిరతిశయం సర్వజ్ఞబీజం"(1-25) అని గలదు. ఈశ్వరునిలో సర్వజ్ఞత్వము నిరతిశయముగానున్నది అతనికన్న నధికముగా నితరమైన యే పదార్థములో నిదిలేదు.

ఈ విధముగా సమస్త జ్ఞానమునకీశ్వరుడు శ్రోతస్సని తెలిపి యిటుల మరల తెలుపుచున్నాడు. "సపూర్వేషామపి గురు: కాలేనానవచ్ఛేదాత్" (1-26) ఈశ్వరునకు కాల విభాగములేనందున నతడు పూర్వఋషులకును గురువే.

పరమేశ్వరుడు జగదారంభమున వేదరూపజ్ఞానము నొసంగి మానవులను సుశిక్షితుల గావించినాడు. వేదమీశ్వరీ జ్ఞానమగుటచే ప్రమాణమని యీదర్శనముకూడా ప్రతిపాదించుచున్నది.

5. పూర్వమీమాంసా-దర్శనకారుని ఉత్తర ప్రత్యుత్తరము లు మిక్కిలి ఆకర్షణీయములుగా నున్నవని "మాక్సుముల్లరు" వ్రాసినాడు. ఇందలితర్కము విశుద్ధతాదృష్టిచే నద్వితీయమైనదని యు నతనియభిప్రాయము.

కోల్ బ్రూక్ మీ మాంసనుగురించి యిటుల వ్రాసినాడు. "మీ మాంసలోని తర్కము శాసన సంబంధమైన తర్కము. నాగ రిక మరియు ధార్మికనియమముల అర్థములదెలిసికొను విధులిందు చూపబడినవి. ప్రతివివాదాస్పదమైన విషయమును మీమాంసకారుడు పరీక్షించి వాని నిర్ణయముల సార్వత్రిక నియమముల కనుకూలము గ నొనర్చినాడు. ఇటులేర్పరచిన నియమములు దర్శనములో సం గ్రహింపబడినవి వీనిసునియమిత ప్రబంధముగాంచిన శాసన సం బంధమైన దార్శనికజ్ఞానము కలుగును, వాస్తవికముగ మీమాంస లో నిటులచేయు ప్రయత్నమేగలదు.

మీమాంసను గురించిన పైయభిప్రాయముల నెఱింగిన పిమ్మట నది వేదములగుఱించి యేమి తెలుపుచున్నదో గ్రహించు ట యవసరము. మీమాంసాకారుడు మొదటి సూత్రములో ధర్మ మును దెలిసికొను జిజ్ఞాస ప్రకటించినాడు. విధి ప్రతిపాద్యమగు అ ర్థమే ధర్మమని రెండవసూత్రములో చెప్పినాడు. "చోదనాలక్షణోఽ ర్థోధర్మః" (1-1-2)

చోదనా లక్షణముగలది ధర్మము, ఏ వాక్యమువినిన ప్రేర ణ గలుగునో నది చోదనయనబడును. చోదనము, నోదనము, ప్రేరణ, వేదాజ్ఞ, ఉపదేశము, విధి, యివన్నియు సమానార్థక శబ్ద ములే. దేనినికోరుదుమో యదియే అర్థము లేక సుఖమనబడును. మూడవసూత్రములో నిటుల తెలిపినాడు.

"తస్య నిమిత్త పరీష్టిః" (1-1-3)

"అధర్మనిమిత్తమైన పరీక్షగావించబడును" ప్రత్యక్షము కే వలమింద్రియ విషయమగుటచే నది ధర్మమునెఱుంగుటలో ప్రమాణముకాజాలదని నాల్గవ సూత్రములో ప్రకటించినాడు. అనుమాన ప్రమాణము కూడా ప్రత్యక్షప్రమాణములోనే సమ్మిళితమై యున్న దని గ్రహించవలెను. అటులైన ధర్మము నెఱుంగుటకు సాధన మేది? ఈప్రశ్నకుత్తరువు ఐదవ సూత్రములో నిటులొసంగినాడు.

"ఔత్పత్తికస్తు శబ్దాస్యార్థేన సంబంధస్తస్య జ్ఞానముప దేశోऽవ్యతిరేకశ్చార్థేऽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణ స్యాన పేక్షత్వాత్" (1-1-5)

శబ్దార్థములకు నిత్యసంబంధమున్నది. అందుచే ధర్మజ్ఞాన మున కది (వేదము) సాధనము. ఈశ్వరునిచే నది ఉపదేశింప బడి నది. మఱియు (ప్రత్యక్షాది (ప్రమాణములచే) ఉపలబ్ధి కాజాలదు. (దానిలో దానియొక్క)వ్యతిరేకములేదు. బాదరాయణుని మనస్సు లో నా(వేదవాక్యము) ప్రమాణముల నపేక్షించకున్నను స్వతః ప్రమాణమైనది.

ఈ సూత్రములో నాలుగు విషయములున్నవి. 1 శబ్దార్థ ములకు నిత్య సంబంధముకలదు. 2 ఆదిఈశ్వరుని యుపదేశము 3 ప్రత్యక్షాదులచే నుపలబ్ధిగాని దర్మము వేదములచే నుపలబ్ధమ గును. మఱియు 4 బాదరాయణుడు వేదముల స్వతఃప్రమాణము గా నంగీకరించినాడు. అందుచే మీమాంసదృష్టిలోకూడా వేదములు స్వతః ప్రమాణములే.

6 ఉత్తరమీమాంస (వేదాంతము):- వేదాంత దర్శనము లోని యారంభ మూడవ సూత్రమగు "శాస్త్రయోనిత్వాత్" లో "ఋగ్వేదాదుల రచించినకారణమున నా బ్రహ్మకలదు. వేదాదుల రచన నిమిత్తహేతువున బ్రహ్మయొక్క యస్తిత్వ మంగీకరింప

బడినది. అతడు వేదోత్పాదకుడు జగదారంభమున ఋషులకు వేదములనొసంగినాడు. ఇట్టి శిక్షయే వేదాంతదర్శనములో పలుసూత్రములందు కన్పించును.

ఈ షడ్దర్శనములు వేదములయొక్క ఉపాంగములు. ఇవి ఐక్య కంఠమున వేదమును ప్రమాణముగా నంగీకరించినవి. వైదిక సాహిత్య వివరణానంతరము "తర్కము" 'శ్రద్ధ' యనుశబ్దముల పరస్పరసంబంధము దెలుపబడును అందువలన తర్కప్రధానములగు దర్శనములే వేదోపాంగములవి గ్రహింపనగును.

## తర్కము మరియు శ్రద్ధ



1. సంస్కృత సాహిత్యములో తర్కమునుగుఱించి యనేక నిందావాక్యములు కలవు. మహాభారతములో నిటులున్నది.

"నతర్కశాస్త్ర దగ్ధాయతథైవ పిశునాయచ"

(మహాభారతము. శాంతి. అ. 246)

"చాడీలుచెప్పు దుష్టులకు, తర్కశాస్త్ర దగ్ధులకు ధర్మప్రాప్తి గలుగజాలదు.

2. వాల్మీకిరామాయణములో నిటులున్నది. 'ధర్మశాస్త్రేషు ముఖ్యేషు విద్యామానేషు దుర్బుధాః। బుద్ధి మాన్వీక్షికీం ప్రాప్యనిరర్థ ప్రవదంతితే॥ (వాల్మీ. రా అయో సర్గ: 100)

"ముఖ్యములగు ధర్మశాస్త్రములుండగా ,దుర్బుద్ధులగువారు తర్కవిద్యను నేర్చి వ్యర్థప్రలాపములుగావింతురు.

3. మహాభారతములో నిటులవ్రాయబడియున్నది. "నాస్తికులు" సమస్తమును శంకించువారు, వేదనిందకులు, మూర్ఖులై తమను పండితులుగా భావించువారు శృగాలజన్మల నెత్తుదురు"

[మహాభారతం. శాంతి. అ. 180]

4. మనుస్మృతిలో "తర్కమునాశ్రయించి వేదమును నిందించు నాస్తికుల సాధుసమాజమునుండి తొలగించవలెనని" కలదు.

(మను 2-11)

5. గౌతమఋషి ప్రణీతమగు తర్కశాస్త్రము నాధారముగా జేసికొని, యన్నింటిని సందేహించువారు నక్కజన్మల నెత్తగలరని "గాంధర్వతంత్ర" ములోగలదు.

6. స్కాందపురాణములో గౌతమమహాముని నిందించబడినది. "తర్కముచే శాస్త్రముల ఖండించిన గౌతముడు, మునులచే శపింపబడి నక్కజన్మను పొందగలడు"

(స్కాంద. కాలికా ఖండము అ 17)

పై యుదాహరణలలో తర్కసాస్త్రమును బాగుగా నిందింప బడినది. కానివాస్తవమునతర్కముగాని, శ్రద్ధగాని చెడ్డవికావు మనుష్యుడు తర్కమునువిడిచి 'శ్రద్ధ' నాశ్రయించినచో, నందవిశ్వాసయు గలవాడగును. శ్రద్ధనువీడి కేవలము తర్కము నాశ్రయించినవాడు 'కుతర్కి'యనబడును. అందుచే నీరెండును నవసరములే. ఈ రెండింటి పరిధుల గ్రహించి వానినాయామేరలలోనే వినియోగించుటవసరము

## తర్కము మరియు శ్రద్ధల పరిమితులు

యాజ్ఞవల్క్యుడు తనభార్యయగు మైత్రేయి కుపదేశించుచు నిటుల తెలిపినాడు. "ఆత్మను దెలియగోరువారు మూడు కార్యముల నాచరింపవలెను. అవి యివి 1. శ్రవణ దర్శనయులు. 2. మననము. 3. నిధిధ్యాసము"

1. శ్రవణదర్శనములు:- ఇంద్రియయులతో జగత్తుయొక్క యథార్థజ్ఞానమును, శ్రవణచక్షురింద్రియయులచే పొందవలెను.

మిథ్యాజ్ఞానము సంపాదింపవలదు.

2 మననము:- తర్కముచే, నింద్రియముల కతీతమగు విషయముల చింతించి, వానియథార్థ జ్ఞానము సంపాదించవలెను.

3 నిదిధ్యాసము:- శ్రవణ, దర్శన, మననములవలన గలిగిన జ్ఞానము నాత్మచే గ్రహించవలెను దీనినే శ్రద్ధా లేక విశ్వాసమందురు. ఇంద్రియములకార్యక్షేత్ర మింద్రియానుభూత జగత్తు వరకేపరిమితమైయుండును తర్కముయొక్క మేర, యంగీకరించబడు జగత్తు వరకు పరిమితమైయుండును నిస్సంశయనిదిధ్యాసముగావించుట యాత్మయొక్క పని. నిదిధ్యాసమనగా అనుభవ పూర్వకముగా గ్రహించుటని యర్థము. మననము గావింపజేయుట "తర్కము" యొక్క పని ఆత్మక్షేత్రమునకు తర్కము ప్రవేశింపవలదు. ఇటుల జరిగిననది కుతర్కమనబడును. ఆ కుతర్కము మనుష్యుని, శ్రద్ధా విశ్వాసములనుండి తొలగించగలదు. అంతఃకరణకార్యమును గమనించిన, నీవిషయము తేటతెల్లమగును

అంతఃకరణ కార్యము:- మస్తిష్కమునకు పై భాగమున నిచ్ఛా శక్తియుండి తన కార్యమును సాగించును. దీనికి కొంచెము క్రిందుగా, మస్తిష్కముపై "మేధావీబుద్ధి" యుండును. దానికి క్రింద మస్తిష్కమధ్యమున "తార్కిక బుద్ధి" కలదు. మస్తిష్కముయొక్క క్రిందిభాగము, మనో సంబంధమైన సందేశతంతువుల స్థానమనబడును. హృదయమునకు పైన 'మనసు'(ఇంద్రియముల నియంత) యొక్క స్థానమున్నది. హృదయము మఱియు నాభి యొక్కమధ్యలో "చిత్త"ముండును. దీనికి క్రిందసూక్ష్మప్రాణము లుండును. ఈ అంతఃకరణములతో "విశ్వశక్తి"పని చేయును. బుద్ధితో జ్ఞానము మఱియు తర్కపూర్ణవిచారము, మనస్సుతో నింద్రియముల వ్యాపారము, చిత్తముతో నుద్రేకాదులు, మరియు ప్రాణములతో భోగకార్యములు గావించబడును. అంతఃకరణముల

కార్యములు సరిగా జరిగినప్పుడిచ్ఛా శక్తియొక్క కార్యములో నాటంకములుగల్గి శక్తి వికాస,వృద్ధులగాంచును. ఇవన్నియునాత్మకుయంత్రాంగములవంటివి. ఇచ్ఛాశక్తివిద్యుత్తు(గతిశక్తి) వంటిది. ఈ కార్యమున నీక్రిందివిధముగా నాటంకములు సంభవించ గలవు.

1 సూక్ష్మప్రాణములు, ఇంద్రియవ్యాపారములగు భావవిచారములలో జోక్యము కలిగించు కొన్నప్పుడు, మనుష్యుడు కోరికలకు దాసుడగును.

2 చిత్తము, ఇంద్రియ వ్యాపారములలో సంబంధము పెట్టుకొనిన, భావుకతవృద్ధిచెంది మనోబుద్ధులు నిష్క్రియములగును.

3 మనస్సు బుద్ధి యొక్క కార్యములో జోక్యముగొన్న, మానవుడింద్రియాదుల జ్ఞానమును విచారింపజాలడు. ఇంద్రియజ్ఞానముతో నాతడుభ్రమాదులనెరుంగక నిర్ణయముగావించుచుండును.

4 ఇటులనే తర్కముకల్పనా స్మృతులయొక్కయు, మేధావిబుద్ధి యొక్కయుకార్యములలో జోక్యంగల్పించుకొన్నచో, మనుష్యుడు కుతర్కముగలవాడై విజ్ఞానము, శ్రద్ధ, మరియువిశ్వాసములనుండి విముఖుడైయుండును అనుమానాదులలో తగుల్కొని యుండును.

5 బుద్ధి, ఇచ్ఛాశక్తిపనిలో సంబంధము పెట్టుకొనినచో నాత్మ పరమాత్మల నైక్యమొనర్చు శక్తినుండి మానవుడువంచితుడగును

6 ఇచ్ఛాశక్తి కార్యములో మరొక విఘ్నముకలుగగలదు. అది అల్పజ్ఞతచే సంభవించును. అల్పజ్ఞతవలనమానవునిలోసందేహము అసఫలత మొదలగు స్వభావము లేర్పడును. ఇది, శక్తివికాసములో గొప్పయాటంకములు గలిగించును. ఇట్టిస్వభావములు గలుగకుండా యుండుటకు మిక్కిలి యత్నించవలెను. మనో బుద్ధి చిత్తాదులు తమతమ సీమలలోపనిజేయుచు, నితరములలో సంబంధము పెట్టుకొననప్పుడు, మానవుడు శ్రద్ధా తర్కములచే లాభంగాంచగలడు

ఓం ఇతిశమ్



-: వెలువడిన గ్రంథములు:-

| | | |
|---|---|---|
| 1. | భగవద్గీత వేదానుకూలమా? | 0-20 |
| 2. | ఈశ్వరుడున్నాడా! | 1-00 |
| 3. | మంత్రిప్రగడ వారి మాట వినుడి | 0-50 |
| 4. | అవినీతి నిర్మూలించుటెట్లు? | 0-50 |
| 5. | మన సంస్కృతి | 0-20 |
| 6. | పతితోద్ధారణ | 0-20 |
| 7. | విడిపోయిన సోదరులు | 0-20 |
| 8. | అగ్నిశబ్దమహాత్మ్యము | 0-25 |
| 9. | ఏది సుగతి? | 0-50 |
| 10 | భారతీయ స్వాతంత్ర్య సందేశము | 0-63 |
| 11. | దయానందుడు. 14వ సముల్లాసము | 0-75 |
| 12. | మనదేశ సేవ | 0-20 |
| 13. | ఈశ్వరుడెందు కవతరించును? | 0-50 |
| 14 | ఆర్యుల పండుగలు | 8-00 |
| 15. | వైదిక దినచర్య | 3-00 |
| 16. | మనుష్యుడ వగుము | 0-25 |
| 17. | భగవద్భక్తి వలన ప్రయోజనయేమి? | 0-15 |
| 18. | వేద రహస్యము | 1-50 |
| 19. | సప్త రహస్యములు | 1-25 |

